## ఈ రూపకమున వచ్చు ముఖ్యపాత్రములు

| పురుషులు | స్త్రీలు |
| --- | --- |
| సూత్రధారుఁడు | కామందకి |
| నటుఁడు | అవలోకిత |
| మాధవుఁడు – నాయకుఁడు | లవంగిక |
| మకరందుఁడు – మిత్రుఁడు | చేటీద్వయము |
| కలహంసుఁడు – సేవకుఁడు | బుద్ధరక్షిత |
| పురుషుఁడు | మదయంతిక |
| అఘోరఘంటుఁడు | కపాలకుండల |
| భూరివసువు మొదలగు కొన్ని పాత్రములు రంగస్థలమునకు రానివి | సౌదామని |

# విన్నపము

మహాకవిభవభూతిప్రణీత మైన మాలతీమాధవ మనెడిప్రకరణమున కిది సముచిత మైనయనువాదము. ఈకవీంద్రునిజీవితమును, ఇతని కావ్యములగొప్పతనమును నాసంస్కృతకవిజీవితమున సవిశేషముగా విశదీకరించియున్నాను. జిజ్ఞాసువులు దానిని బరిశీలింతురు గాక.

ఉత్పాద్యము ప్రఖ్యాతము మిశ్రము అని మూఁడువిధము లైన యితివృత్తములలో నిందలిది కేవలము కవి కల్పిత మైనది. దానంజేసి యిది రూపకములలో ప్రకరణ మను పేరఁ బరఁగుచున్నది. ప్రకరణమున కంకములు పది యుండును.

మాలతీమాధవమందలి ప్రధానరసము శృంగారమే కాని, సందర్భోచితముగా వీరకరుణాద్భుతాదు లభివర్ణితము లగుటంజేసి కథ యెక్కువగా రక్తి కట్టినది. ఈరూపకమునఁ బ్రధాననాయకుఁడు విప్రుఁడు సత్కులసంజాతుఁడు నగును గాని, ధీరశాంతుఁడు కాఁడు. మఱియు నిందు మాలతీమాధవులయుదంతమే ప్రధాన మగుట వాస్తవమే కాని, మదయన్తికామకరందులవృత్తాంతము గూడ దాని కనుస్యూతము కాక పోలేదు. ఏది యెట్లున్నను, రూపకమునకు వాంఛింపఁదగినఫలము సహృదయరంజకత్వమే కాని, కేవలము లక్షణముల వెంటఁ బడుట కాదు కదా!!

వస్తుపాత్రరసపోషణమున సిద్ధహస్తు లైనపూర్వకవు లైదాఱుగురిలో భవభూతి యొకఁడు. ఉత్తరరామచరిత్రలో ప్రేక్షకుల నుఱ్ఱూఁతలూఁగించినయాచతురిమ నేర్చినది మాలతీమాధవమే.

కామందకి బ్రాహ్మణి చదువుకొన్నది తిరిపె మెత్తుకొని జీవించుచున్న బౌద్ధసన్యాసిని. అయితే నేమి? ఈ పదియంకముల ప్రకరణమును భద్రముగాఁ బ్రవర్తింపఁ జేసినరాజనీతినిపుణురా లామె. ఇట్లే తక్కినయెల్ల పాత్రములును తమతమచర్యలయెడ నప్రమత్తములై రసానుగుణముగాఁ బ్రవర్తించిన వనుట తథ్యము.

ఈరూపకమును మక్కికిమక్కి యన్నట్లు ప్రతిపదాంధ్రీకరణ పద్ధతిని గాక, భావముప్రధానముగాఁ దెలిగించితిని. ఇందలియౌచిత్యానౌచిత్యములకుఁ బ్రాజ్ఞలోకమే ప్రమాణము.

దీని ప్రథమముద్రణాధికారము మాత్రము సికిందరాబాదు పుస్తకవర్తకు లగు శ్రీ చిట్టా వెంకటరామశాస్త్రిగారి కిచ్చితిని. కాపీరైటు కృతికర్తదే.

ధవళేశ్వరము
8 - 6 - 1958

మల్లాది సూర్యనారాయణశాస్త్రి

ఓన్నమః పరబ్రహ్మణే

# మాలతీమాధవము

## ప్రథమాఙ్కము

### నాంది

శ్లో. ఆత్మానందానుసంధాత్రీం
వన్దే వాగ్దేవతాం పరామ్.
వన్దే తద్దేవతామూర్తిం
మహాకవిపరమ్పరామ్.

మ. తలఁ గైసేసినకర్పరంబులఁ జలద్గంగాంబువుల్ నిండ, మిం
చులకున్ మించినఫాలనేత్రరుచులన్ సొంపారి, లేఁగేదఁగిన్
దలఁపింపం దగులేఁతచందురునిచందం బంద మీఁ, నొప్పు నా
గలతావేష్టితజూటముల్ శివుజటల్ గాపాడు మిమ్మెల్లెడన్.

చ. ఆనటరాజునాట్యసమయంబున నందికృతానకస్వనం
బానఁగ వచ్చుషణ్ముఖునియానముఁ గాంచి తలంకి శేషుఁడె
ళ్లని యణంగ నాసిక, మిళిందతతుల్ కటసీమ మ్రోఁగ, నిం
పైనమహాగణాధిపతియాననచాలనశోభ యేలుతన్.

# ప్ర స్తా వ న

## నాం ద్యం త మున

సూత్రధారుఁడు — (ప్రవేశించి) చాలునయ్యా! చాలు. నిఖిలభువన ద్వీపములకు నిత్యదీప మైనసహస్రాంశుఁ డావిర్భవించి, అదుగో, అక్షిగోచరుఁ డగుచున్నాఁడు (చేతులు జోడించి)

శా. దేవా! యీవిధి జీవరాసులు ప్రవర్తిల్లంగ నీ తేజముల్
గావే మూలము? నీవు సర్వజగతీకల్యాణసంధాతవున్
గావే? నాదురితం బణంపుము జగన్నాథా! నమస్కారముల్
నీవే నాశరణంబు సర్వశుభముల్ సేకూర్చి రక్షింపుమా.

(తెరవంక చూచి) మారిషా! రంగమంగళకార్యములు చక్కఁగా నెఱవేఱినవి. మహాకాలనాథునియాత్రగా నరుదెంచిన నానా దేశముల పుణ్యాత్ములు నిందు విచ్చేసి యున్నారు. నేఁడు వీనులవిం దగుక్రొత్తకథతోడిరూపక మభినయించి మా కానంద మొనగూర్పు మని యీవిద్వన్మహాసభ యాదేశించుచున్నది. ఇట్టియెడ నింకా మననటు లుదాసీనులై యున్నా రేమి? పరిషత్తు కోరినట్లు సుగుణభూయిష్ఠ మైనప్రబంధము నేఁడు ప్రదర్శింతము.

నటుఁడు — (ప్రవేశించి) బావా! ఈవిద్వత్సభ కోరుచున్న యాసుగుణము లేవి?

సూ — చెప్పెద వినుము.

గీ. భావనాస్వాద్య మగురసభావపటిమ,
రసము నలరించునఖిలపాత్రములపొత్తు,

తగినయుద్ధతి చిత్రకథాప్రసక్తి,
అన్నిటిం దీర్చువిమలగాథానురక్తి.

నటు — బావా! ఇన్నిసుగుణము లెం దున్నవి?

సూ — (ఆలోచించి) ఆఁ! స్మృతికి వచ్చినది. దక్షిణాపథమున పద్మపుర మనునొకనగరము కలదు. అందు తైత్తిరీయులు పంక్తిపావనులు కాశ్యపగోత్రులు పంచాగ్నులు సోమపీథులు ధృతవ్రతులు బ్రహ్మవాదులు నైన 'ఉదుంబరు' లను బ్రాహ్మణులు కొందఱు గలరు.

గీ. వారు చదువుదు రాత్మతత్త్వం బెఱుంగ,
ధనము లార్జింతు రిష్టపూర్తము లొనర్పఁ,
బెండ్లియాడుదు రన్వయవృద్ధిఁ గోరి,
బ్రతికియుందురు సత్తపోవ్రతముకొఱకు.

అట్టివారిలో వాజపేయయాజి యగుమహాకవి యనువిద్వాంసునికిఁ బౌత్రునిపౌత్రుఁడును లోకప్రసిద్ధి గాంచిన భట్టగోపాలునికిఁ బౌత్రుఁడును, పవిత్రకీర్తు లగుజతుకర్ణీనీలకంఠపండితులకుఁ బుత్రుఁడును, అన్వర్థనామధేయుఁ డగుజ్ఞాననిధికిఁ బ్రియశిష్యుఁడును పదవాక్యప్రమాణజ్ఞుఁడును శ్రీకంఠనామధేయుఁ డయ్యు భవభూతి బిరుదనామమున విఖ్యాతిగన్నమహాకవి సంస్కృతమున మాలతీమాధవ మనుప్రకరణమును నిర్మించియున్నాఁడు. దానిని గౌతమీతీరవాసులును హారీతగోత్రులాపస్తంబసూత్రులును తైత్తిరీయులును మల్లాద్యుపనామకులు శ్రోత్రియులునై వేదశాస్త్రప్రవచనంబున వన్నెకెక్కినలక్ష్మీనృసింహావధాని ప్రభృతిపురుషులవరుసలోఁ జేరొందినసకలతంత్ర స్వతంత్రుఁడును శతాయువు నగు రామస్వామిశాస్త్రికిఁ బౌత్రుండును వేదవేదాంతజ్ఞాని

శ్రీరామావధానికిని సాధ్వీమతల్లి యగు వెంకమాంబకును బుత్త్రుండును చర్ల బ్రహ్మశాస్త్రి గురువరకరుణాధీత పాణినీయుఁడును, మంథా చెన్నయ శాస్త్రిగురుకృపాసమధిగతప్రస్థానత్రయుండును సంస్కృతాంధ్రసారస్వత సారజ్ఞుండు నుభయభాషాకవియు నైన సూర్యనారాయణశాస్త్రి రసో దంచితముగా ననువదించి మన కిచ్చెను. ఈ కృతినిగూర్చి వా రన్న మాట లివి :—

ఉ. ఈకృతి గాంచి యెవ్వ రవహేళనసేయుదు రామహాత్ములే
దే కనుఁగొందు రొండు, రచియింపఁగలే దిది వారికోసమై
మాకు సమానధర్ముఁ డగుమానిసి పుట్టకపోఁడు భూతలం
బా కడలంటి యుండె, కడ యన్నది లేనిది కాల మందుమా.

విన్నావా ? ఆఁ ! ఉండు. వారిమాట యింకొకటి —

ఉ. నేర్చితి వేదశాస్త్రములు నేర్చితి సాంఖ్యము యోగశాస్త్రమున్
నేర్చితి నంట యేల కృతి నీరసమే ? నటుగాక యర్థముల్
తీర్చినభావముల్ రుచులు తేటినమాటలు నాటకంబునన్
జేర్చితినా, అదే తెలియఁజేయును విద్యలఁ గల్గుచాతురిన్.

వింటివా ? ఇఁక జాగేల ? ఆదర్శనీయరూపకమును ప్రదర్శింప వేషధారణమందును తౌర్యత్రికప్రయోగమందును సిద్ధముకం డని మన కుశీలవుల కెల్లరకుఁ దెలియఁజెప్పుము.

నటు — బావా ! మన నటులు సిద్ధముగానే యున్నారు. ఇక రంగస్థల మున ముందుగాఁ బ్రవేశింపవలసిన — పాత్రములలో బౌద్ధ సన్యాసినియగు కామందకి నీవు కదా ! ఆమెశిష్యురా లైన యవలోకిత నేను —

సూత్ర — అయితే ఇంకేమి? —

నటు — ప్రకరణనాయకుఁడును మాలతీవల్లభుఁడు నైనమాధవునిభూమిక మాట యేమి?

సూత్ర — కలహంసక మకరంద పాత్రప్రవేశసందర్భమునఁ గదా మాధవ వేషధారణము మాట వచ్చును? ఇపుడు దాని తొందర యేమి?

నటు — అయితే సరే. ఇఁక నభినయ మారంభించి సామాజికులను రంజింపఁ జేయుదము.

సూత్ర — మంచిది. ఇదిగో నేను కామందకి నైతిని.

నటు — నే నవలోకిత నైతిని.

(ఇరువురు నిష్క్రమింతురు.)

ఇది ప్రస్తావన

---

# వి ష్కం భ ము

(అంత వారిరువురు రక్తవస్త్రములు ధరించి కామందక్యవలోకితలై ప్రవేశింతురు.)

కామందకి — వత్సా ! అవలోకితా !

అవ — ఏమి సెలవు ?

కామం — భూరివసువుకూఁతురు మాలతియు దేవరాతునికొడుకు మాధవుఁడును కులశీలవయోరూపాది లక్షణముల నొకరికొకరు తగిన వధూవరులు. ఆ చిరంజీవు లిద్దఱికిని పెండ్లి యైతే యందఱు నానందింపరటే ! (సహర్షముగా నెడమ కన్నదరుటసూచించి) సెబాసు ! !

గీ. మాలతీమాధవవివాహమంగళంబు
దలఁచునాకోర్కి తప్పక ఫలము గాంచు
ననుచు వివరింపఁ గాఁబోలు నదరెఁ గన్ను
వామ మయ్యును దాక్షిణ్యభావ మలర.

అవ — ఈ విషయమున పూజ్యురాలి మనోవేదన యింతంత కాదు. ఔరా ! అందం దేటి తెచ్చుకొన్న గుడ్డపేలిక లొకటిగాఁ జేర్చి కుట్టుకొన్న బొంత కట్టుకొని, బిచ్చమెత్తి తెచ్చుకొన్న మెతుకులు తిని జీవించుచున్న మీకు మంత్రిశేఖరుఁ డగుభూరివసువు స్వార్థపరాయణుఁడై యిట్టిసాంసారిక మైనకష్టకృత్యము నియోగించుఁగాక. సర్వసంగపరిత్యాగము చేసి ముక్తినాసించు మీ మనోనిగ్రహమున కడ్డమైనయీగడ్డుపనికి మీరు సిద్ధపడుట వింత గాదా ?

కామం — బిడ్డా ! అట్లనరాదు. భూరివసువు నాకు ప్రాణతుల్యుఁడు పుణ్యవర్తనుఁడు, ఆబాల్యమిత్రుఁడు —

గీ. అతఁడుచెప్పినపని మైత్రి కాద్యఫలము,
ప్రణయసారంబు, దానిని ప్రాణమేని
తపమునే నిచ్చి తీర్తునా, ధన్యురాల,
నదియె మోక్షంబుకంటె నా కధికతరము.

సరేకాని, మేమందఱము కలసి చిరకాల మందందు చదువుకొను చుండ నొకనాఁడు సౌదామిని కూడా దగ్గఱనుండఁ గానే "మనము గృహమేధులమై సంతానవంతుల మైనపుడు తప్పక వియ్య మందుకొనవలె" నని భూరివసు దేవరాతులు ప్రతిజ్ఞ చేసి కొనియున్నా రన్నమాట నీవుమాత్రము వినలే దటే ? ఇపుడా విదర్భరాజమంత్రి దేవరాతుఁడు న్యాయశాస్త్రము చదువుకొనుట కని తనకొడుకు మాధవుని కుండినపురమునుండి యీపద్మావతీపురమున కంపినాడు. ఈ పని యెంతదూరదృష్టితో చేసి నదో చూచితివా ?

గీ. చిన్నతనమునఁ దాము చేసినప్రతిజ్ఞఁ
దగినసమయాన మిత్రుండు తలఁపఁజేసె,
మఱియు మాలతి కన్నిట మాధవుండె
తగినవరుఁ డన్నయాసక్తి తనరఁ జేసె.

అవ — అయితే ఈయమాత్యుఁడు స్వయముగానే తనకన్యను మాధవుని కిచ్చి పెండ్లి చేయక, దొంగపెండ్లిచేయు మని మిమ్ము తొందర పెట్టుట యెందు కమ్మా ?

కామం — గీ. నరవిభునినర్మసచివుండు నందనుండు
కన్నెఁ గోరుచునుండె భూకాంతునోట,
ఎదుటనే యివ్వ నన్న రా జీసుఁ జెందు
నందు కీమంత్రి యీయుపాయము దలంచె.

అవ — ఔరా ! మనయమాత్యుఁ డింతదనుక మాధవునిపేరు కూడా విననివానివలె కనఁబడితే అది నిజమే యనుకొన్నాను. ఎంత వింత ?

కామం — అదంతా నటన - అటు రాజును వంచించవలెను. ఇటు, పెద్ద లెవ్వరికిని తెలియదనుకొనునట్లు మాలతీమాధవు లొకరి నొకరు ప్రేమించుకొనుచుండవలెను. ఇదే మంత్రి చర్యలోని విశేషము. కాని, ఆ యువతీయువకుల పరస్పరానురాగముమాత్రము పౌరలోక మెఱుఁగక పోలేదు — అది వెల్లడియగుటయు మన కిపుడు మంచిదే. ఏమంటువా ?

ఈయుపాయమున పెండ్లి జరిగినను, "మాలతీమాధవులు పరస్పరానురాగమున గాంధర్వవివాహము చేసికొన్నారుగాని యిది కామందకి సమకూర్చినది కా" దన్నమాట పుట్టును. దానివల్ల నాపైని నింద తప్పును. పద్మావతీరాజు నతనిసఖుఁడును వంచితులగుదురు. ఇంతకంటె మనకు కావలసిన దేమి ? అది గాక, యిం కొక్కటి చెప్పెద నాలకింపుము.

మ. తనభావంబు నెఱుంగనీ, కొరులయాంతర్యంబు తాఁ గాంచియున్
గనన ట్లుందఁతిఁ గన్నొఱంగి, తను లోకం బెల్ల నమ్మంగ నే
మిని మాటాడక, తాఁదటస్థుఁడయి నేర్మిం జూపి చేయంగఁబూ
నినకార్యంబును నిర్వహించు నెటులేనిన్ బుద్ధిమంతుం డొగిన్.

అవ — భగవతీ ! బాగున్నది. అందుకే మీమాటనుబట్టి నేనును, ఏమేమో చెప్పి, మాలతికిఁ గనఁబడునట్లు మంత్రిగారి మేడప్రక్క వీథిలో మాధవుఁడు తఱుచు తిరుగునట్లు చేసినాను.

కామం — అది సరే. మఱి, యింతకు ముందే మాలతి దాదికూతురు లవంగిక చెప్పినమాట విన్నావా ?

చ. మరలను గంటఁ బడ్డనవమన్మథు నారతియట్లు వీథిలో
మరిమరి యిట్టటుం దిరుగుమాధవు మాలతి కోర్కులూర బం
గరుకిటికీకడ న్నిలిచి కన్గొని కన్గొని కామవేదనన్
బరవశ యయ్యె నంగములు వాడఁగఁ జొచ్చెఁ దదేకచింతనన్.

అవ — ఆమాట నిజమే. అంతే కాదు. మాలతి మనసు పట్టలేక నిరంతర మాసౌందర్యము తిలకించుచు నానందించుటకై యతని రూపమును చిత్రించినది. ఆచిత్రఫలకమునే లవంగిక తెచ్చి యిపు డిపుడే మందారిక కిచ్చినది కూడా.

కామం — (ఊహించి) లవంగిక మంచిపని చేసినది. మాధవుని పరిచరుఁడైన కలహంసుఁడు బౌద్ధాలయ పరిచారిక యగు మందారికను గామించుచున్నాఁడు. ఆదారిని చిత్తరువు క్రమముగా మాధవునిచేతి కంది ప్రకృతానురాగ కథ కుపోద్ఘాత మగు నని దానియభిప్రాయము.

అవ — మన్మథోత్సవము జరుగుచున్న మదనోద్యానమున కేగ నెంతో పురికొల్పి మాధవు నీయుదయముననే యక్కడికి పంపించినాను. మాలతి యక్కడికి తప్పక వెళ్ళునుగదా! వారొకరి నొకరు ప్రత్యక్షముగా సాభిలాషముగాఁ జూచుకొందురు.

కామం — మేలు మేలు. నీ వీరీతిని నాపనికి తోడ్పడి నాపూర్వశిష్యురాలైన సౌదామనిని జ్ఞప్తికి తెచ్చినావు.

అవ — భగవతీ! అపూర్వ మైన మంత్రసిద్ధివల్ల నాశ్చర్య మైనమహిమ నార్జించిన యాసౌదామని యిపుడు శ్రీపర్వతముమీఁద కాపాలికవ్రత మాచరించుచున్న దఁట!

కామం — నీ కెవరు చెప్పినారు ?

అవ — ఈనగరమున కావల పితృవనముచెంత కరాల యనుపేరుగల చాముండాదేవత యాలయ మున్నది.

కామం — అవును విన్నాను. ఆదేవత వివిధజంతువులను బలిగోరుచుండు నని సాహసికు లనుకొనుట కలదు.

అవ — శ్రీపర్వతమునుండి యక్కడికి వచ్చిన కపాలధారి యైనయఘోర ఘంటుఁడాగుడిలో దేవి కెదురుగా కూర్చుండి తదేకదీక్షతో మంత్రసిద్ధికై జపించుచున్నాఁడు. మహామహిమకలదియు వాని శిష్యురాలు నైన కపాలకుండల ప్రతిసాయంకాలము వానిదగ్గఱకు వెళ్ళి వచ్చుచుండును. వానిద్వారా యీవార్త వచ్చినది.

కామం — అయితే సరే. సౌదామని శ్రీపర్వతము మీఁద నున్నదని నమ్మవచ్చును.

అవ — ఇపుడు వీళ్ల గొడవ యెందుకుఁ గాని, భగవతీ! మాధవుని ప్రాణమిత్రుఁడైన మకరందుఁడు నందనునిచెల్లెలైన మదయంతికను పెండ్లాడుట సంభవించెనా, అది మాధవునికి మఱియొక కోరిక నెఱవేఱిన ట్లగునుజుమీ!

కామం — ఔను. అందుకోసమై నాప్రియసఖియగు బుద్ధరక్షితను నియోగించియున్నాను.

అవ — అల్లాగా? మంచిపని చేసినావు తల్లీ!

కామం — మఱిలే. మదనోద్యానమున కేగిన మాధవునిసంగతి తెలిసికొని మాలతిని చూచివత్తము.

(ఇరువురు లేతురు)

కామం — (ఆలోచించి) అబ్బో! మాలతి స్వభావ మతిగంభీరము. మెల్ల మెల్లగా నెట్లో యామెమనసు కనిపెట్టి తక్కినపని తానై నెఱ

వేర్చుదూతికవలె నేను మిక్కిలినేర్పుతో మెలఁగవలసియున్నది.
(ధీరదృష్టిం జూచుచు)

చ. కలువను శారదేందురుచికై వడి సన్న నినవ్వుతోడి సి
గ్గలరెడు మాలతీలసదపాంగవిలోకనశోభ మాధవు
న్నలరుచుఁగాత నామెహృదయంబు నలర్చెడుఁగాత నాతఁడా
నలుఁవసమానశీలఘటనాపటుచాతురి వాసి కెక్కఁగన్.

(ఇరువురు నిష్క్రమింతురు)

ఇది విష్కంభము.

(అంత, చిత్రరుపును లేఖనోపకరణములను చేతఁబట్టుకొని కలహంసుఁడు ప్రవేశించును.)

కల — నవమన్మథుని గర్వ మణఁగించు చక్కఁదనమున మాలతీ హృదయగాంభీర్యము నూటాడించిన నాప్రభువు మాధవుఁ డిపు డెందుండెనో! (పరిక్రమించి) అబ్బా! తిరిగితిరిగి అలసిపోయి నాను. ఈపూలతోటలో నించుక విశ్రమించి తరువాత మక రందునితో నున్నయతనిని చూచెదఁగాక.

(అని యొకచోఁ గూర్చుండును)

(అంతట మకరందుఁడు వేఱొకచోఁ బ్రవేశించును.)

మక — మాధవుఁడు మదనోద్యానమునకు వెళ్లెనని అవలోకిత చెప్పి నది. కానీ! నేను నక్కడికే పోయెదను. (పరిక్రమించి, చూచి) దైవవశమున నతఁ డిటే వచ్చుచున్నాఁడు. (చక్కఁగా నిరూపించి)

ఉ. ఏమది చూపు శూన్య? మడుగే పడ, దూర్పులు హెచ్చె, తోఁచు నె ట్లోమెయిచాయ, సన్నగిలెనోపిక, – యెందుకువింత? మన్మథా

జ్ఞామహిమంబు దుస్తరము, జవ్వనమా కలఁగించు నుల్ల మిం
కేమి? మనోహరంబు లగునెల్లవిభావము లూరకుండునా?

(అంత, చెప్పినరీతిగా మాధవుఁడు ప్రవేశించును.)

మాధ — అబ్బా! ఏమిది?

ఉ. ఆవిమలాంగి శారదసుధాంశునిభాస్యఁ దదేకదీక్షుగా
భావన చేసిచేసి యొకపట్టున నిల్పక నామనంబు ల
జ్జావినయంబులన్ సుగుణసారవివేకము నుజ్జగించి న
ల్రోవలఁ బర్వులెత్తు నెటుఁ దోఁచఁగ నీనివికారచేష్టలన్.

(పరిక్రమించి) ఆహా! ఎంతవింత? ఏమిగతి?

గీ. ఆరమణిచెంత నుండ నన్యంబు మఱచి,
యద్భుతానందమగ్నమై యమృత మలఁది
నట్టులుండిన నాహృదయం బదేమొ!
పండునిప్పులఁ బొరలిన ట్లుండె నిపుడు.

మక — (సమీపించి) మిత్రమా! ఇటురమ్ము. లలాటంతపుఁ డగు చండాంశుఁడు మండిపడుచున్నాఁడు. ఈయుద్యానమున నొకింత సేపు కూర్చుందము రా.

(ఇద్దఱు పరిక్రమింతురు)

కల — (అటుచూచి) ఏమిటి? మాధవుఁడు మకరందునితో నీబాలోద్యానమునే యలంకరించుచున్నాఁడా? సరే సమీపించి మదన వేదనాపరవశురా లగు మాలతికన్నుల కమృతప్రాయ మైన యీచిత్రఫలకము చూపించెద — (ఒక్కడుగు వేసి) పోనీ! అతని నించుకంత విశ్రాంతిసుఖ మనుభవింపనీ! —

మక — వికసితపుష్పపరాగంబు వెదచల్లుచు బాలోద్యాన మెల్ల పరిమళింపఁజేయు నీసంపెఁగచెట్టుక్రిందఁ గూర్చుందము.

(ఇద్దఱు నుపవసింతురు)

మక — వయస్యా! పౌరాంగన లెల్ల పరమోత్సాహముతో చిరుపు మహోత్సవమున నయనాభిరామమై విలసిల్లుమదనోద్యానమున కేగితివఁట! మఱి యీలాగునఁ గనఁబడుచున్నా వేమి? అక్కడ నీవు కుసుమశరుని బాణములకు గుఱి కాలేదుగదా!

మాధ — (సిగ్గుతో తలవంచుకొనును)

మక — (నవ్వి) మొగము వంచుకొంటి వేమి?

గీ. సర్వజంతుసముండు నిష్పక్షపాతి
బ్రహ్మరుద్రాదులన్ వశపఱచుకొన్న
వీరుఁ డాపంచబాణుండు వినమె కీర్తి?
సిగ్గుపడె దేల? నిజము దాఁచెద వదేల?

మాధ — వయస్యా! నీకుఁ జెప్పకుండునా? అవలోకిత వేడుక పుట్టింప మదనదేవాయతనమున కేగితిని. అట్టిటు కొంతవడి తిరిగితిరిగి యలసి విశ్రమింపఁగోరి, ఆమందిరంబు ముంగిట విరియఁ బూసి మనోహరంబై యున్న చిన్నపొగడచెట్టుక్రిందఁ గూర్చుండి, దానినుండిరాలినపువ్వులు పోగుచేసి చక్కనిదండ గ్రుచ్చుట కారంభించితిని. అంత విశ్వవిజేతయైన కామదేవుని విజయ పతాక నడచి వచ్చుచున్నదా యన్నట్లు గర్భాలయమునుండి బయలువెడలి బహునిపుణపరిచారికాజనపరివృతయై కన్యకాత్వము వెల్లడించు కమనీయవసనాలంకారశోభతో నతిగంభీర స్వభావయగునొకసుందరి నేత్రపర్వమై నే నున్నప్రదేశమునకే

వచ్చినది. ఆప్రథమసందర్శన మీాజన్మలో నీక మఱపునకు రాదు. ఆహా!!

గి. దివ్యలావణ్యనిధి కధిదేవత యన,
నిఖిలసౌందర్యరాశికి నిలయ మనఁగ,
జెలఁగునాచెల్వకు మరుండు సృష్టికర్త
కమలనాళేందుచంద్రికల్ కారణంబు.

అంత, చెలికత్తెలు పనికత్తెలును పువ్వులు కోయులీలకు పురికొల్ప వారితో నే నున్నవకుళవృక్షమువంకకే యాలతాంగి వచ్చినది. చక్కఁగా నిరీక్షించుతునా, ఎంతోపుణ్యము చేసి పుట్టిన యాలావణ్యమూర్తిలో చాలారోజులుగా పెరుగుచువచ్చిన మదనసంతాపవికారము నాకు గోచరించినది ఎట్లందువా?

గీ. వాడె మైదీఁగ త్రుంచినతూఁడునాఁగ,
చెలులు బ్రతిమాలి చెప్పఁగాఁ జేయుఁ బనులు,
నవ్యకరిదంతఖండకాన్తంబు లైన
చెక్కిళులు పోలె నకలంకశీతరుచిని.

చూచినది మొదలుగా నమృతవర్తివలె నాకన్నుల కమితానందము సమకూర్చిన యాకన్యామణి అయస్కాంతమణి లోహధాతువుంబోలె నాయన్తఃకరణము నాకర్షించినది. పెక్కుమాట లెందుకు మిత్రమా!

ఉ. ఇంచుకయే నెఱుంగక తదింగితముం, దనయున్కియున్ నిదా
నించక, నాకు సంతతము నెవ్వగఁ గూర్చ నకారణంబ యా
కాంచనగాత్రిపై నిలచె గట్టిగ నాహృదయంబు; దైవమే
మెంచెనో? సౌఖ్యదుఃఖముల నెయ్యదినాకు లభింపఁజేయునో?

మక — వయస్యా! స్నేహ మేమి? కారణము నపేక్షించు టేమి? ఇవి పౌసఁగనిమాటలు. స్నేహ మనునది స్వాభావిక మైనధర్మము. అది నిరుపాధికము, అకృత్రిమము. చూడు —

చ. కలుపుఁ బదార్థసంతతి నొకానొకలోపలికారణం, బదే
తెలియఁగ స్నేహ మంచు వినుతిం గనుఁ నయ్యది కోర దెన్నఁడున్
వెలుపలికారణంబు, లిది నిక్కము, చంద్రుని గాంచుచున్ విధూ
పలము ద్రవించు సూర్యుఁ గని పంకజమున్ వికసించుఁగాదొకో!

సరే! తరువాత నే మైనది?

మాధ — ఏమయినదా?

చ. ముసిముసినవ్వు లార నను ముందుగఁ బోల్చినచేటి చెప్పఁగా
గుసగుస లాడుకొంచు నను గుర్తిడి యా నసుకొంచు నందఱ
ద్దెస నొక రొక్కరిం గడచి తీఁగలు పోగయినట్లు కూడి న
న్న సదృశసస్మితాదరకటాక్షసుమంబుల ముంచి రొక్కటన్.

మక — (తనలో) గుర్తు పట్టినారా? అ దెట్లో? వింతము —

మాధ — అంతట వా రందఱు కంకణంబులు గలగల లాడుచు క్రిందికి జాఱ, కరకమలంబులు పయి కెత్తి చప్పట్లు చఱచుచు, మేఖలాకలాపకింకిణీజాలంబును మంజుమంజీరంబులును కలకలనాదం బొనరింప, కలహంసలగమన మనుకరించి యడుగులు వైచుచు నల్లనల్లన నించుక వెనుకకు మరలి "భర్తృదారికా! మాపంట పండినది. ఏపుణ్యమూర్తికో ప్రేమపాత్ర మైన యొక రెవరో దైవవశమున నిక్కడనే కనవచ్చినారమ్మా! అరుగో చూడుము" అనుచు హస్తాంగుళీవిలాసంబుల నన్నుఁ జూపించిరి.

మక — సెబాసు! పూర్వ మామెహృదయ మంటియున్న గాఢానురాగము మెల్లగా బయటఁ బడుచున్నది.

కల — వీ రారంభించిన స్త్రీ కథ సరసము లై నసందర్భములతో
చక్కఁగా కొనసాగుచున్నది. కానీ!!

మక — తరువాత నేమి జరిగినది మిత్రమా!

మాధ — ఏమి చెప్పుదును?

చ. గురు వయి మన్మథుం డపుడు క్రొత్తగ నేర్పినయట్లు, కూరిమిన్
బరవశమై మనం బెగయ, నామది ధైర్య మణంచుచున్ మనో
హరలలితత్రపాస్మితదృగంచలలీలలు భ్రూవిలాసముల్
సురుచిరభంగి నత్తరుణి చూపినచొప్పులు చెప్ప నేర్తు నే?

అయిన నవ్వీక్షణవిశేషము నొకింత వినిపింతు వినుము.

సీ. ఒకచూపు కుల్కుచు నొక్కింత నను సోఁకి
మురియుచు దాఁగురుమూఁత లాడె,
ఒకచూపు క్రేగంట నొయ్యనొయ్యనఁ జని
యవతంసరుచులతో నాటలాడె,
ఒకచూపు కనురెప్ప లొత్తుచు నే తెంచి
నాచూపు కదియ వెన్కకును జాఱె,
ఒకచూపు క్రీఁగంట నొదిఁగి చెక్కిలి దీర్చి
చిఱునవ్వులీలతోఁ జెలిమి చేసె,

గీ. అట్లు క్రీడించి యాసరోజాక్షి చూపు
లలసియుం గూడి యుత్సాహబలము కలిమి
నశరణం బైన నాహృదయంబు వెల్వ
రించి స్నేహాంబుతో రంగరించి క్రిందె.

నే నపు డాసవిశేషసానురాగవిలోకనంబులచే నాసర్వాంగసుం
దరికి సన్నిధిని వశీకృతుండనై హృదయశూన్యుండ నయ్యు నాయధై

ర్యంబును మఱుంగుపఱుపఁ దలఁచి మున్ను ప్రారంభించిన పూలదండ నెట్లో పూర్తిచేసి మెడలో వేసికొంటిని. అంత వేత్రపాణులైన కంచుకులు వెంబడింప నపుడు వచ్చినయాడేనుఁగు నెక్కి యావధూటీరత్నము నగరమార్గ మలంకరించినది. అనంగుఁ డాలతాంగికి నేర్పినచదువులోని సారము నాకపు డనుభవమునకు వచ్చినది.

మక — అదెట్లు మిత్రమా ?

మాధ—గీ. కరిణిపై నేగునాకంబుకంఠి తఱుచు
సురుచిరాస్యంబు వెనుద్రిప్పి చూచునపుడు
విషము నమృతంబుఁ బూసినవిషమశరుని
శరము నా నాటె నోకకటాక్షంబు మదిని.

చ. అది మొద లింత యంత యని యట్టిది యిట్టిది యంచుఁదెల్ప రా,
నిది తొలిజన్మమాట గననేరను గాని యిహాన మున్ను నా,
కొదవని, దద్భుతంబు పరమోద్ధత మైనవికార మొండు నా
మదిని దహించుచుండె నభిమానవివేకము లంతరింపఁగన్.

మకరందా ! దానిమహిమవర్ణనాతీతము, విచిత్రము —

చ. ఎదుటనె యుండువస్తు వది యేమొ గ్రహింపఁగరాదు, మున్న గ
న్నదె యగుఁగాక యాతలఁపు నామది కెక్కదు మంచువాన చ
ల్లఁదనము సీదు, వెన్నెల వెలార్చునె నాతనుతాప ? మార ! నా
హృదయము నిల్వ దెందును సహింపదు దేనిని, కోరు నేదియో !

కల — ఏపుణ్యాత్మురాలో మాప్రభుహృదయము నపహరించినది —
ఇంకెవరు ? మాలతియే —

మక — (తనలో) అబ్బా ! ఇంతలోనే యితనికనువేదు తెంత హెచ్చి
నది ? — ఏవేని మంచిమాటలు చెప్పి చూతునా ? (ఆలోచించి)

ఏమి లాభము ? ఇతఁడు పెళ్లి యైనఁగాని వెఱ్ఱి కుదుర దన్న స్థితికి వచ్చియున్నాఁడు. ఇట్టియెడ —

గీ. అంగజన్ముండు నభినవయౌవనంబుఁ
జేరి తమచేతికీల్బొమ్మఁ జేసికొనఁగ,
"కామమోహంబులన్ బుద్ధిఁ గలఁగనీకు"
మనెడిహితవాక్య మీతండు వినునె యిపుడు ?

(ప్రకా) అయితే మిత్రమా! ఆసుందరికులగోత్రములు పేరు తెలిసికొన్నావా ?

మాధ — ఆఁ! తెలిసినవి. ఆయువతీమణి యేనుఁగు నెక్కినసమయమం దాక చేటి తనచెలికత్తెలతో విడిపోయి పువ్వులు కోయుచు నల్లనల్లన నాచెంతఁ జేరి నామెడలోని వకుళమాలిక చూచి నవ్వుమొగముతో నమస్కరించి "మహానుభావా ! చాతుర్య ముట్టిపడఁ గ్రొత్తపద్ధతిని గ్రుచ్చినయీమాల్య మెంతో మనో హరముగా నున్నది. పుష్పదామనిర్మాణమందు మాభర్తృ దారికకూడా మంచి నిపుణురాలు. అతికుతూహలముతో వింత వింతరీతులపూలదండలు నిర్మించు నామెనేర్పు వాసి కెక్కి యున్నది. ఇపు డత్యభినవమాల్యవరసన్నివేశపరతంత్ర యైన యావధూరత్నము మెప్పు గాంచి మీమాల్యము చరితార్థ మగుఁగాక. మీనిర్మాణకౌశలము సఫల మగుఁగాక. సరసమై యనర్ఘ మైనమీదండకు, మాభర్తృదారిక కంఠసీమ నలంక రించుట సమర్థ మైనమూల్య మగుఁగాక అని ప్రసంగించినది —

మక — ఆహా ! ఏమి దానివాక్చాతుర్యము ? ఎంత భావగంభీరముగా నున్నది ?

మాధ — అప్పు "డామె యెవరు? నీ వెవ" రని నే నడుగ, "ఆసుందరి మంత్రిశేఖరు లైనభూరివసువుగారికూఁతురు, నే నామెదాదికూఁతు నైన లవంగికను" అని చెప్పినది.

కల — (సంతోషముతో) మాలతియే కదా! సెబాసు! ఇఁక, నాకామదేవునివిలాసము వృద్ధి గాంచును. నావచ్చినపనియు సార్థక మగును.

మక — (తనలో) సెబాసు! ప్రధానామాత్యుఁడు కన్నబిడ్డయగుటయే కాదు, సౌశీల్యసౌజన్యముల కాశ్రయమైన యాకోమలాంగి, మాలతి మాలతి యని పూజ్యురా లైనకామందకి కొనియాడుచున్నదియే. ఇంకేమి కావలెను? కాని, ఈసుందరినే పద్మావతీరాజు తననర్మసచివుఁ డగు నందనుని కిమ్మని మంత్రి నడుగుచున్నట్లు కింవదంతి మాత్రము కలదు. కానీ!! (ప్రకాశముగా) తరువాత నేమి జరిగినది మిత్రమా!

మాధ — అది మఱిమఱి కోరఁగా దానిమాట తీసివేయ లేక నామెడలోనిదండ తీసి దాని కిచ్చితిని. అదియు నామాల్యము నిట్టటు తేఱిచూచి, నేను మాలతిని చూడకమునుపు గ్రుచ్చినదానికిని తరువాత గ్రుచ్చినదానికిని తేడా కనిపెట్టినది కాఁబోలు, సాభిప్రాయముగా నవ్వుచు "ఇది మహాప్రసాద" మని నుతించినది. అంత మదనోత్సవము చూచి పోవుచున్న పౌరజానపదులగుంపులు హెచ్చఁగా నందులోఁ బడి యాచేటి మఱుఁ గైనది. నే నిటు వచ్చినాను.

మక — వయస్యా! మొట్టమొదటిచూపులోనే యామెచెక్కిళ్లు తెల్లవడినట్లు నీకు గోచరించుటయు, మీ రొకరినొకరు చూచుకొనునప్పు డామె సవిలాసకటాక్షములు నీయంతఃకరణము నాకర్షించు

టయు భావింపఁగా, ఇంతకు మున్నే నీయెడ నామెహృదయము గాఢముగా నాసక్తమై యున్న దని స్పష్ట మైనది. ఎప్పు డేవిధముగా నిన్నామె కన్నారఁ గాంచినదో తెలియఁజాలను గాని, సత్కులప్రసూతలు శీలవతులు నైనకన్నెలు మనసార నొకరిని ప్రేమించి కన్నార మఱియొకరిని కామించ రని మాత్రము నిశ్చయముగాఁ జెప్పఁగలను. ఆమాట యటుండనీ! కాని, నిన్నామె యింతకుమున్ను ప్రేమించి యున్నదనుటకు రెండు సూచనలుమాత్రము గోచరించుచున్నవి. ఎట్లందువా, "ఏపుణ్యమూర్తికో ప్రేమపాత్రమైన యొకరెవరో యిక్కడనే యున్నా" రనుచు చెలికత్తెలు నిన్నామెకు చూపుట యొకటి —

మాధ — ఇఁక రెండవ దేమిటి వయస్యా!

మక — అడుగనేల? ఆలవంగికమాటలనేర్పే —

కల — (సమీపించి) ఇది మూడవది (అని చిత్తరువు చూపును)

(ఇద్దఱు చూతురు)

మక — కలహంసా! ఈమాధవునిరూప మెవరు చిత్రించినారు?

కల — అయ్యగారిహృదయము నపహరించినవారే —

మక — ఏమిటి? ఇది మాలతి వ్రాసిన దేనా?

కల — సందేహ మేల?

మాధ — వయస్యా! నిస్సందేహముగా నీయూహ నిజమైనది.

మక — ఓరీ! ఇది నీ కెవ రిచ్చిరి?

కల — మందారిక —

మక — దాని కెవ రిచ్చినారో!

కల — లవంగిక యిచ్చిన దఁట!

మక — మాలతి యెందుకోస మిది వ్రాసినదో, అది యేమైనా చెప్పినదా ?

కల — అయ్యగారిని చూచుచు నానందించుటకై —

మక — వయస్యా ! ఇఁక నీవూఱడిల్లుము —

గీ. నిండువెన్నెల యాకన్నె నీకనులకు,
నీవు వలపులపంట వానెలఁతమదికి,
ఆత్మభువు లిద్ద ఱేకమై యూదుకొన్న
కార్యమాఁగునె ? మీసమాగమము నిజము.

నీహృదయ మపహరించి నీ కింతమనోవికారము కలిగించిన యా సందర్శనీయసుందరాకృతి నిందు చిత్రించి చూపుము.

మాధ — అట్లే చేసెద — కలహంసకా !

కల — చిత్తము (లేఖనోపకరణము లిచ్చును)

మాధ — (మాలతీరూపము చిత్రించుచు) మిత్రమా మకరంద !

చ. కనుఁగవ హర్ష బాష్పములు గ్రమ్ముచునుండఁగ మాటిమాటికిన్
మనసు గలంగుచుండ మెయి ప్రాన్పడుచుండఁ జెమర్చుచుండఁ జే
వణఁకుచునుండ వ్రే, ళ్లిటులొ వ్రాయుచునుంటిని గాని, యవ్విలా
సినిసొగ సెల్ల నిందు గనఁజేయుటమాత్ర మశక్యమే సుఖా !!

(అనుచుఁ గొంతసేపు లిఖించి పటమిచ్చును)

మక — (చిత్తరువు చక్కఁగా బరిశీలించి) ఆహా ! మాధవా ! నీ మనస్సింత గాఢముగా నామెయందు లగ్నమైన దంటేతప్పు లేదు. అది యుక్తమే. (క్రిందచూచి) ఔరా ! ఇంతలో పద్యముకూడా నిర్మించినావా ? (చదువును)

చ. హృదయ మలర్పఁ జాలుశరదిందుకలాదిపదార్థముల్ జగ
ద్విదితము లెన్ని యేని కల, వుండఁగని మ్మటు వాని నెల్ల, నా
యెద నలరింపఁ జాలినమదీక్షణచంద్రిక సిగ్గు కూర్మియున్
మదిఁ గొనఁ జూచునీసుగుద మాలతిమాత్రమె జన్మకంతకున్.

(అని చదివి చిత్తరువు కలహంసకుని కిచ్చును)

(అంతే మందారిక ప్రవేశించును)

మందా — కలహంసా! కలహంసా! ఓరిదొంగా! నీయడుగుల జాడను బట్టి నిన్ను పట్టుకొన్నానురా! (అని ముందుచూచి సిగ్గుతో) ఈ మహానుభావు లిద్దఱు నిక్కడనే యున్నారా? (సమీపించి) అయ్యలారా! నమస్కారము.

మ. మా — మందారికా! ఇటు రావే!

మందా — కలహంసా! నాచిత్తరువేది? — తే!

కల — ఇదిగో తీసుకో! (అని యిచ్చును)

మందా — (గ్రహించి చూచి) ఎవ రెందుకోస మిందు మాలతీరూపము లిఖించినారు?

కల — ఆమె యెందుకోస మెవరిని చిత్రించెనో వా రందుకొఱకే యామెను చిత్రించినారు.

మందా — (సంతోషముతో) ఇట్టియనురూపవధూవరులను సృజించిన బ్రహ్మదేవుని చాతుర్యము ఫలోన్ముఖ మయినట్లే నమ్మఁదగును.

మక — మందారికా! నీ ప్రియుఁడు కలహంసుఁ డీవు డన్న మాట నమ్మఁదగిన దేనా?

మందా — తప్పకుండ —

మక — ఇంతకు ముందు మాలతి మాధవు నెపుడు చూచినది?

మందా — బంగారుకిటికీవద్ద నిలిచి చూచుచుండే దని లవంగిక చెప్పినది.

మక — సరే! ఇది తగిన తార్కాణము. ఆప్రక్క వీథిని మనము తఱుచు తిరుగుచుండెడివారముకాదా మిత్రమా!

మందా — మహాభాగా! నాకు సెల విప్వండి. ఇంత మనోహరముగా రూపము చిత్రింపఁజేసినమన్మథుని మహత్త్వమును లవంగికకు తెలియఁజేయవలెను.

మక — దానికి తప్పక చూపించవలసినసమయ మిది తొందరగా వెళ్లు.

( మందారిక చిత్రఫలకముతో నిష్క్రమించును. )

మక — మాధవా! మట్టమధ్యాహ్నమైనది. ఇంక మన మింటికి పోవుదము.

(ఇరువురు లేచి పరిక్రమింతురు)

మాధ — ఇపుడు నా కీలాగున తోఁచుచున్నది.

గీ. తనదు సఖురాండ్రు వేఁడికిఁ దాళలేక,
చెక్కులం దున్నకుంకుమ చెదరి పోవ,
నుస్సు రస్సు రటంచుఁ దా ముందురు గద!
యెట్టు లీతాప మోర్చు నాయిందువదన?

(అనుచు మొగమెత్తి తీవ్రముగా జూచి)

శా. ఓరీ మారుత! నాదుమాట విను మోహాహో కాదు, నాశాసనం
బారామంబులకుందకోశమకరందామోదముల్ మేన నే
పారం దాలిచి యేగి తాప ముడివోవం గౌఁగిటం గూర్చి యా
నారీరత్నము, వేగ వచ్చి యిటకున్ నామేను సేవింపుమీ!

మక — (తనలో)

గీ. అక్కటా! యింతలోనె యనంగుఁ డిట్లు
కుసుమగాత్రుని మాధవుఁ గ్రుంగఁదీసె
సన్నిపాతజ్వరాతిప్రచండ మైన
కూటపాకల మేనుంగుగున్న నట్లు.

ఇపు డేమిగది? — భగవతి యైనకామందకియే శరణము.

మాధ — (అటు నిటుఁ జూచి తనలో)
ఏ మీచిత్రము?

గీ. ఇందు నందును నాక నా కెల్లయెడలఁ
గరణిపై నేగినట్టి యాకంబుకంఠి
యాననాంబుజ మొక్కటే కానవచ్చు
మహితలం బెల్ల మాలతీమయము గాఁగ.

(ప్రకా) వయస్యా! ఇపుడు నాయవస్థ యెట్లున్నదో యెఱుఁగుదువా?

చ. తెలుపఁగరానితీవ్రగతి దేహముఁ గ్రమ్మె నదేమి తాపమో!
బలిమి హరించు నాయవయవంబులశక్తి నదేమి మోహమో!
సలసలఁ గాఁగి పొంగి దిగజాఱెడుఁ జిత్త మదేమి పాపమో!
తెలియదు, కాని యే నిలచితిం దరుణీస్మరణామృతంబునన్.

అని యందఱు నిష్క్రమింతురు.

ఇది వకుళవీథి యనుప్రథమాంకము.

---

# మాలతీమాధవము

## ద్వితీయాఙ్కము

### ప్రవేశకము

(తరువాత, చేటీద్వయము ప్రవేశించును)

ప్రథమ — సఖీ ! ఇందాఁకా, సంగీతశాలదగ్గఱ పూజ్యురాలైన కామందకి అవలోకితతో నేమో మాటాడుచున్నదే !

ద్వితీయ — మాధవుని స్నేహితుఁడైన మకరందుఁడు మదనోద్యాన వృత్తాంత మంతా పూసగ్రుచ్చినట్లు భగవతికి విన్నవించినాఁడఁట. ఆయమ్మ భర్తృదారికను చూడఁగోరి, ఆవిడ యేమి చేయుచున్నదో చూచి రమ్మని అవలోకితను పంపించినది. అది వచ్చి నన్నడిగినది. ఎవ్వరును పోఁగూడని రహస్యస్థలములో లవంగికతో భర్తృదారిక మాటాడుచు నున్న దని చెప్పి పంపినాను.

ప్రథ — చెలీ ! లవంగిక కేసరపుష్పాలకోసము మదనోద్యానమునకు వెళ్లినది గదా ! అపుడే తిరిగి వచ్చినదా ?

ద్వితీ — ఆఁ! అది రావడముతోనే ఆవిడ దానిచేయి పట్టుకొని మఱెవ్వరు రాకుండ తిన్నగా మేడెక్కి ఆటలచావడిప్రక్క నున్న చిన్నగదిలోనికి తీసుకొని వెళ్లినది.

ప్రథ — అయితే, ఆమహానుభావునిచరిత్ర వినుచు నిపు డానందించుచున్న దన్నమాట.

ద్వితీ — (నిశ్వసించి) ఆమెకు చిత్తశాంతి యెక్కడిది? ఈపరస్పరసందర్శనము, మోహావేశ మింకా హెచ్చుటకే వచ్చినది. పైగా రాజుగారు తమ నర్మసచివుఁడైన నందనునికి మాలతి నిమ్మని మంత్రిగారి నడుగుట, వారు బదులు చెప్పుట కూడా యీాయుదయమే తటస్థించినది.

ప్రథ — ఏమిచెప్పినారో మంత్రిగారు?

ద్వితీ — "మహారాజా! తమకన్యల సేయఁ దామే కర్తలు" అని మనవిచేసినా రఁట. దీనినిబట్టి మాధవునిమీాఁది యనురాగము మాలతికి బ్రతికినన్నాళ్లు మనశ్శల్యమే యని నా యూహ.

ప్రథ — అల్లాగనకు. పూజ్యురాలైనకామందకి మంచినేర్పు చూపి యీాకార్యము నెఱవేర్చకపోదు.

ద్వితీ — ఈతెలివి తక్కువమాటల కేమిలే! కట్టిపెట్టు. మన మింకఁ బోదమురా!!

(ఇద్దఱు నిష్క్రమింతురు)

(ఇది ప్రవేశకము)

[తరువాత, సోత్కంఠ యగుమాలతియు, లవంగికయు కూర్చుండి ప్రవేశింతురు]

మాల — సఖీ! చెప్పు తరువాత —

లవం — అంత నామహానుభావుఁ డీవకుళమాల నా కిచ్చెను (అని సమర్పించును)

మాల — (సహర్షముగా దండ పరిశీలించి) సఖీ! దీనిలో నొకప్రక్క పువ్వులకూర్పు హెచ్చుతగ్గుగా నున్నది సుమీా!

లవం — ఆతప్పు నీదే.

మాల — అ దేమిటే?

లవం — ఆదూర్వాశ్యామలాంగుని హృదయ మాకర్షించి యతనిచేతికి వణఁకు తెచ్చినావు.

మాల — న న్నాడించుట కిట్లు పలుకుచున్నావా?

లవం — సఖి! ఇందు ని న్నాడింప నేను కల్పించిన దే మున్నది? తాను గ్రుచ్చుచున్న యీదండ సొగసుఁదనమునకు తానే మెచ్చుకొనుచున్నట్లుగా, వికసించి చల్లగాలికి కదలు కమలములో యన కన్నులు విప్పి కనుబొమ్మలు నటింప నిన్ను చూచి కామపరవశుఁడై యతఁ డాశ్చర్యానందమగ్నుఁ డయ్యెనా లేదా? ఆమనోహరుని ముఖవికాసవిలాసములను నీవు కన్నులార కనుఁగొన్నావా లేదా? నిజము చెప్పు.

మాల — (లవంగికను కౌఁగిలించి) ఔను గాని, చెలీ! ఆదృష్టివిలాసము లతనికి సహజములో? నాయెడ ననురాగమున నవు డావిర్భవించినవో, ఎట్లు నిర్ణయము?

లవం —(నవ్వి) అల్లాగా? పాపము!! అయితే నీవక్కడ, ఆడినదంతా వట్టియాటయే. అది నీస్వభావము కాఁబోలు!

మాల — (సిగ్గుపడి నవ్వుచు) ఆఁ! ఆఁ! సరిలే! తరువాత —

లవం — ఇం కే మున్నది? తిరిగి పోవుచున్న యాత్రాజనము సందడి హెచ్చఁగా నతఁడు నాకు కనఁబడలేదు. నేను తిన్నగా మందారికయింటికి వచ్చినాను — ప్రొద్దుట దానిచేతికి చిత్రఫలక మిచ్చినానులే!

మాల — ఎందుకోస మిచ్చినావు?

లవం — దానిని కోరుచున్న కలహంసకుఁడు మాధవుని యనుచరుఁడు. అది తనప్రియునికి చూపించునుగదా యని, తరువాత సంతోష వార్త తెలుపునుగదా యని —

మాల — (తనలో సంతోషముతో) కలహంసకుఁ డాచిత్తరువునుతప్పక తన ప్రభువునకు చూపించునుగదా యని యిచ్చినది – (ప్రకా) అయితే, సఖి! నీవు విన్న సంతోషవార్త యేమి?

లవం — తా నక్కడను నీ విక్కడను పరితపించుట భావించి, యీామ నోరథంబు దుర్లభం బన్న దుఃఖావేశముచే నోర్వరానివిరహానలంబునఁ బడి యుడికిపోవుతనహృదయమున కొక్కనిమిషమేని శాంతి కలిగించుకొనఁ గోరి లిఖించిన నీప్రతిమ యిదిగో! (చిత్తరువు చూపును)

మాల — (పుచ్చుకొని నిశ్వసించి సహర్షముగా చూచి) ఇప్పుడైనా, నామది కాశ్వాసము కలుగలేదు. ఇట్టి యూఱడింపుకూడా స్వాభావికమే యనుకొందును – క్రింద నేవో అక్షరము లున్నవి! ("హృదయ మలర్పజా" లన్న పద్యము చదివి సానందముగా) మహాభాగా! నీయాకార మెంతమధురమో నీమాట లంత మధురములు. నీదర్శనమో ప్రత్యక్షమం దతిమనోహరము, అప్రత్యక్షమున నతిదారుణము, అతిసంతాపకరము. మనోహరమూర్తీ! నిన్నుఁ గన్నారఁ జూడని స్త్రీలును, నిన్నుఁజూచి మనస్సు నిలుపుకొని ప్రాణముతో నుండఁగలిగిన కన్యలును ధన్యురాండ్రు.

లవం — సఖీ! ఇది కూడా నీహృదయమున కూఱట కలిగించలేదా?

మాల — ఇపుడు కొత్తగా, నామనోవేదన నుపశమింపఁజేసిన దే మున్న దే? అట్లడుగుచున్నావు?

లవం — త్రుంపినయశోకపల్లవమునట్లు హృదయము నెట్లో నిలుపుకొని నవమాలికాకుసుమసుకుమార వైననీ వెవరినిమిత్తము మదన తాపమున మిక్కిలి చిక్కుచున్నావో, అతఁడే తనదుస్సహ

నైన మదనబాధను నీకు తెలిపెనుగదా! ఇంతకంటె నీ కాశ్వాసహేతు వేమి కావలెనమ్మా?

మాల — సఖీ! మహాప్రభావసంపన్నుఁడైన యతఁడు కుశలముగా నుండుఁగాక. నాకు మాత్రము చిత్తశాంతి కలుగఁబోదు. (కన్నీ రొలుక—)

చ. అనవరతంబు నాతనువు నంగమునంగము నొంచి యేర్చు న
య్యనలముమాడ్కి దుర్విషమునట్లు దురంతవిషజ్వరంబుతీ
రున హృదయార్తి; నీవు నన్నుఁబ్రోవఁగఁజాలవు తల్లిదండ్రు లిం
దున కసమర్థు, లెందును మనోవ్యథ మాన్పఁగ మందు లే దిలన్.

(అనుచు విషాదము నటించును)

లవం — సఖీ! నీపరితాప మట్టిదే. సజ్జనసమాగమములు ప్రత్యక్ష సుఖప్రదములు పరోక్షదుఃఖదాయకములు గదా! కిటికీసందుల నుండి యామాధవుని జూచినప్పుడే మదనిబారికిఁ జిక్కిన నీవు సింధుచంద్రుని జూచి నిప్పులగుండ మనుకొన్నట్లుగా నెంతో పరితపించేదానవు. ఇంక సవిశేషముగా సన్నిధిని జూచి వచ్చిన యీ సమయమున నీసంతాపము సహింప రాకున్న దన్న నాశ్చర్య మేమి? ఎంత శ్రమపడినా, దుర్లభ మైనమనోరథమును సాధించుటయే జన్మసాఫల్యము. కావున నీగాఢానురాగమున కనురూప మైన మాధవసమాగమము సిద్ధింప యత్నించుటయే కర్తవ్యము.

మాల— చెలీ! నామీఁద నీ కున్న యాదరమునుబట్టి యిట్లు సాహసించి యుపన్యసించుచున్నావా? చాలులే? (కంటనీరుపెట్టి) ఇంతకు నీ త ప్పే మున్నది? మాటిమాటి కామనోహరుని చూచుచు, చెదరిపోవుహృదయము నెట్లో పదిలపఱుచుచు,

కులకన్యకలమర్యాద నతిక్రమించి మీానలుగురిలో తేలిక యగు నట్లు సిగ్గు విడిచి యదే వ్యసనముగా ప్రవర్తించుట నాదే తప్పు. అయితే నేమిలే!!

చ. విషవక యెల్లరాత్రులు దివిం బడి మండుచు నిండుచంద్రుఁ డీ యొడలు దహించుఁగాక మదనోద్ధతవహ్నికిఁ దోడుగాఁగ, నా నడవడి యుం గులంబు మలినంబులు గాఁ దలిదండ్రు లాత్మలో నడలఁగ సాహసించి ప్రియు నంటను, లే దిఁక జీవితాశయున్.

లవం — (తనలో) ఇపు డిం కేమిగతి దైవమా!

(నేపథ్యార్ధప్రవిష్టయై)

ప్రతీహారి — పూజ్యులైరా లయిన కామందకి దయచేసెను.

ఇద్దఱు — భగవతి యేనా?

ప్రతీ — అవునమ్మా! భర్తృదారికను చూడ వచ్చినది.

ఇద్దఱు — అయితే ఆలస్యమేల?

(ప్రతీహారి వెడలెను - మాలతి చిత్తరువు దాఁచెను)

లవం — (తనలో) మంచిసమయమునకు వచ్చినది.

(పిదప, కామందకి, అవలోకిత, ప్రవేశింతురు)

కామం — మిత్రమా! భూరివసూ! మంచిపనిచేసితివి. "తమకన్యల నీయఁ దామే కర్త" లని రాజుగారితో మనవిచేసినావా? మేలు మేలు. ఇది, యుభయలోకసమ్మతమైనప్రత్యుత్తరము — ఇపుడు విన్న మదనోద్యానవృత్తాంతమును బట్టి దైవముకూడా అనుకూల ముగా నున్నట్లే తలఁచుచున్నాను. మాధవునిపూలదండ మాలతికంఠ మలంకరించుట, అతనిరూపము నీమె చిత్రించి పంపుట, ఎంతో సంతోషము కలిగించినవి. వధూవరులపరస్ప రానురాగమే కదా వివాహామునకు కావలసిన ముఖ్యశుభలక్ష

ణము ! అంగిరసుఁడుకూడా, "ఎచ్చట నయనమానసము లత్యాసక్తము లగునో అచ్చటనే శ్రేయస్సు లంకురించు" నన్నాఁడు.

అవ — ఇదిగో మాలతి (అనిచూపును)

మాల — (అర్ధనిమీలితనేత్రయై పరాకుగా నుండును)

కామం — (తేఱిచూచి)

చ. ఒడలు కృశించెఁగాని యపు డొల్చినయట్టియరంటియూఁచనాఁ,
గడపటిరేకతో డిశశిక్షై వడిఁ బొల్చెడు నేత్రపర్వమై,
వెడవిలుకానిచేఁతలకు విహ్వాలయై వివశాత్మయైన యీ
బుడుతను జూడఁగా మనసు పొంగెడుఁ గ్రుంగెడుఁ గంప మొందెడున్.

(ముఖమీక్షించి)

గీ. పాలిపోయెను గాని కపోలయుగళి
ముద్దు లొల్కుచునుండెను మోము, బళిర !
సహజసౌందర్యమున మించుజవ్వనులకు
నంగజవికారములు గూడ నంద మిచ్చు.

(మాలతిమైమఱపు కనిపెట్టి)

తదేకధ్యానపరవశ యైన యీకన్నెకన్ను లరవిరిమొగ్గలట్లు కనవచ్చుట చూడ నిది నిజముగా నిపుడు మానసిక మైనప్రియసమాగమసుఖ మనుభవించుచున్న దనవచ్చును.[1] (అనుచు మిక్కిలి దరిచేరును)

లవం — (మాలతిని కదల్చును)

ఇరువురు — (లేతురు)

---

1. శృంగారము హెచ్చుగా నుండుటచే నిచ్చట "నీవీబంధేత్యాది" శ్లోకము వర్ధము విడువఁబడెను.

మాల — భగవతీ ! వందనము.

కామం — గొప్పపుణ్యముచేసి పుట్టినందుకు తగినభాగ్యము పట్టుఁగాక-

లవం — అమ్మా ! ఇది పావనమైన సుఖాసనము -

[అందఱు నుపవసింతురు]

మాల — పూజ్యురాలికి కుశలమా ?

కామ — (నిట్టూర్చి) కుశలమే యనుకోవలెను -

లవం — (తనలో) ఆడఁబోవు కపటనాటకమున కిది ప్రస్తావన — (ప్రకా) అమ్మా! కంఠములో కన్నీ రణఁచుకొనుచు కష్టముతో పలికిన ట్లున్న దీమాట. ఈవిచారమునకు హేతు వేమి తల్లీ!

కామం — మీవంటి సంసారులపిల్లతో బొంత కట్టుకొన్న నావంటిసన్యాసినికిఁ దగనిపరిచయమే —

లవం — అ దేమిభగవతీ ! అట్లుసెలవిచ్చినారు ?

కామం — అదేమే ? నీవుకూడా, ఎఱుఁగన ట్లడిగెద వేమి ? —

( మాలతిని చూపుచు )

గీ. అంగజన్మునివిజయాస్త్ర మనఁగ వెలయు
సహజసౌందర్యరాశి యీసరసిజాక్షి
తనదునూతేండ్లబ్రతుకు వ్యర్థంబు గాఁగఁ
బరమనిర్భాగ్యుచేతిలోఁ బడుచునుండె.

మాల — మొగము వెలవెలఁబాఱఁ జూచును

లవం — రాజుగారినిర్బంధమువల్ల నందనునికి మాలతి నీయ నమాత్యుఁ డంగీకరించినట్లును, అది విని పురజను లందఱు మంత్రిని నిందించుచున్నట్లును పుకారు పొక్కినమాట నిజమే.

మాల — ( తనలో ) నన్ను మానాన్న రాజుగారికి కానుకగా నిచ్చెనా ?

కామం — ఔరా! ఇంతకంటె వింత గలదా?

ఉ. ఏమని సమ్మతించె గుణహీనుని కాత్మజ నీయ మంత్రి?—యొ
క్టో మనుజేంద్రుమెప్పు గొన నెంచెనునీచపుసీతి పుత్రికా
ప్రేమ గణించునా? నృపుని వేడుకమంతిరి యల్లుఁడన్న గొ
ప్పే మఱి చూచెఁగాని కనెనే తనకూఁతురిభావ మెట్టిదో?

మాల — (తనలో) మాతండ్రికి రాజుగారిమెప్పే యెక్కువగాని మాలతి యెక్కువ కాదు.

లవం — అమ్మా! తమరు సెలవిచ్చిన దక్షరాలా నిజము. అదే కాక పోతే, ఆ కురూపునికి వయస్సు మళ్లినవానికి ఏమి చూచి పిల్ల నిచ్చెద నన్నాఁడమాత్యుఁడు?

మాల — (తనలో) అయ్యో! చచ్చినాను. అభాగ్యురాలను, పిడుగు వచ్చి మీఁద పడ్డది.

లవం — భగవతీ! కరుణింపుము. జీవన్మరణముపాలు గాకుండ మాలతిని రక్షింపుము. తల్లీ! మాలతి నీకూఁతురే అనుకో!

కామం — లోకములో తఱచుగా కన్యలపెండ్లి తండ్రిచేయును, దైవము చేయును. అంతే కాని, ఇందు నే నేమి చేయఁగలను!—అయితే, విశ్వామిత్రునికూతురైనశకుంతల స్వయముగా దుష్యంతుని వరించిన దని, ఊర్వశి యనునప్సరస పురూరవుని కోరిన దని, తనతండ్రి తన్ను సంజయుఁ డనురాజునకు వాగ్దానము చేసి యుండ, నతనిని గాదని వాసవదత్త వత్సరాజును పెండ్లాడిన దని పూర్వులు చెప్పినకథలు లేకపోలేదు. అయినా, అట్టి సాహసవిధి నుపదేశించుట నావంటిదానికి తగునా?—కాని, ఈమాట మాత్రము నిజము.

గీ. భూవరునిమెప్పు గోరెడిభూరివసువు
మాలతిని నందనుని కిచ్చి మేలు గాంచు,
ఆకురూపుండు చేపట్టు నీకుమారి
నిందుకల మర్గ్రిహంబు గ్రహించునట్లు.

మాల — (తనలో) అయ్యో! తండ్రీ! నాయెడ నీవే యిట్టివాఁడ వైతే, లోకములో నిఁక నధికారభోగవాంఛలకు లొంగనివా రెవ రుందురు?

అవ — భగవతీ! మనము వచ్చి చాలా సే పయినది. ఆమహాభాగుఁడు మాధవునిమనస్సు కుదురుగా లేదు గదా!

కామం — ఔనౌను. ఇదిగో వెళ్లిపోదము. (మాలతిని చూచి) కుమారీ! పోయి వచ్చెద.

లవం — (జనాంతికము) ఇపు డామహానుభావుని వృత్తాంత మొకింత భగవతివల్ల తెలిసికొందమా?

మాల — (జనాంతికము) నాకుకూడా అదే తోఁచినది. అడుగు —

లవం — భగవతీ! మీ రింతప్రేమతో చూచుచున్న యీ మాధవుఁ డెవ రమ్మా!

కామం — అది యిపుడు ప్రస్తావించవలసినది గాదు, పెద్దకథ —

లవం — అయినా, దయచేసి కొంచెము తెలుపఁగోరెదము.

కామం — అయితే వినండి కొంచెము — విదర్భరాజ ప్రధానమంత్రి దేవరాతుఁడు. అతఁడు సకలదేశసజ్జనచూడామణి యని కీర్తి గన్నవాఁడు. కుమారీ! మీతండ్రి యతనితో కలసి యొక గురువునొద్ద విద్య లభ్యసించినాఁడు. అతనిమహిమ నితఁ డెఱుఁగును.

గీ. అఖిలసద్గుణపేటి దయామయుండు
శాంతమూర్తి దిగంతవిశ్రాంతకీర్తి,
అతనితోఁ బోల్పఁదగిన మహానుభావుఁ
డెక్కడే నుండెనేమొ? నే నెఱుఁగఁజాల.

మాల — (సహర్షముగా) ఔనే. భగవతి పేర్కొన్న యామహాపురు
మునిపేరు మానాన్నగా రెన్నోసారులు స్మరించియున్నారు.

లవం — సఖీ! అంతేకాదు. ఈభగవతియు వా రిద్దఱును కలసి చదువు
కొన్నా రని యెఱిఁగినవా రెందఱో ముచ్చటించుకొనుచుండ
నేను వినియున్నాను.

కామం — ఔ నతఁడే.

చ. అతనికిఁ బుట్టె నొక్కఁ డుదయాద్రికిఁ బుట్టినబాలచంద్రుఁ
ట్లతిసుకుమారగాత్రుఁడు గుణాభరణుండు కలాభిరాముఁడై
అతులమనోహరాంగరుచి యందఱికన్నులవిందుగా ననం
గత నెడఁబాసి యంగజుఁడు కారణజన్మము గాంచెనో యనన్!

లవం — (అపవారించి) అతఁడు మాధవుఁడే యనుకొందును.

కామం — తెలియుచున్నదా? సంగ్రహించి చెప్పుచున్నాను.

చ. ప్రవిమలబుద్ధియై జనకుపజ్జన విద్యలు నేర్చి, తర్కవి
ద్య వడయ నిందు వచ్చినసుధాకరమండలసుందరాస్యుఁ డా
యువమణి యెందు కంటఁ బడుచుండునో యందె పురంబునల్లడన్
యువతికటాక్షజాలముల నుత్పలజాలము లుప్పతిల్లెడున్.

అతఁ డీపురమున నుండి తన బాల్యస్నేహితుఁ డగుమకరందు
నితోఁ గూడి ఆన్వీక్షికీవిద్య నభ్యసించుచున్నాఁడు. అతఁడే మీ రను
కొనుచున్న మాధవుఁడు.

మాల — (సంతోషముతో జనాంతికము) సఖీ! ఆమనోహరుఁ డుత్తమ
కులప్రసూతుఁ డని తెలిసినది. చాలును.

లవం — (జనాంతికము) చెలీ! పారిజాతము పాలసముద్రమునఁ గాక
మఱెందైనఁ బుట్టునా?

( తెరలో శంఖధ్వని )

కామం — ఔరా! సాయంకాల మైనదా?

గీ. తమిఁ బెనంగినచక్రవాకములకవలు
గాంచుసుఖనిద్ర భంగమై కంప మొంద
దివ్యసౌధాంతరములు ప్రతిధ్వనింప
సాంధ్యశంఖధ్వనుల్ మింట సందడించె.

(మాలతింజూచి) కుమారీ! సుఖ ముండుము. (లేచును)

మాల — (అపవారించి) నేను తేనికి కాను కైతినా? (సాస్రము)
నాన్నా! నీకు రాజానుగ్రహమే ప్రధానమా? నీవే యిట్లు
లోఁబడిపోతే లోకములో నిఁక భోగవాంఛలకు లొంగనివా
రెవ రుందురు? (సానందము) ఆమనోహరుఁడు మహాకులప్రసూ
తుఁడా? — పారిజాతము పాలసముద్రమునఁ గాక మఱెక్కడ
పుట్టు నని మాబాగా చెప్పినది లవంగిక. (ఉత్కంఠతో) నే నా
సుందరాంగుని మరలఁ జూతునా! —

లవం — అవలోకితా! ఈచతుశ్శాలమార్గమున దిగుదము.

కామం — (అపవారితము) అవలోకితా! చక్కఁగా జరిగినది. నేను
తటస్థురాలనై మాలతిదగ్గఱ నిర్వహింపవలసిన దూత్యభార
ములో మూఁడువంతులు తగ్గినది. ఎట్లందువా?

ఉ. రోఁత జనింపఁజేసితిఁ గురూపుఁడు నందనుమీఁదఁ, దండ్రిదు
ర్నీతిని నమ్మఁజేసితిఁ, బునీతము లైన శకుంతలాదిక
న్యాతిలకానురాగవిషయంబులు తెల్పితి, మాధవాన్వయ
ఖ్యాతిని జెప్పితిన్, గడమకార్యము వీరి యభీష్టసిద్ధియే.

(అందఱు నిష్క్రమింతురు)

ఇది ధవళగృహ మను ద్వితీయాంకము.

---

# మాలతీమాధవము

## తృతీయాఙ్కము

### ప్రవేశకము

బుద్ధరక్షిత — (ప్రవేశించి పరిక్రమించి పైకి చూచి) — అవలోకితా! పూజ్యురా లెక్కడున్నదో యెఱుఁగుదువా?

అవలోకిత — (ప్రవేశించి) అదేమిటే! మఱచిపోయినావా? ఆవిడ మాలతిదగ్గఱకు వెళ్లి యెంతసేపయినదో! ఇప్పటికి రాలేదు. తిరిపమెత్తి తెచ్చుకొన్న రెండుమెతుకులు తినడానికైనా తీఱికలేదాతల్లికి.

బుద్ధ — ఔనే — నీ వెక్కడికి వెళ్లినావు?

అవ — శంకరపురముచెంత నున్నకామోద్యానములో పూలతీగ లల్లుకొని యున్న పొదరిల్లనడుమ నున్న కంకేళివనములో నుండుమని మాధవునితో చెప్పి వచ్చుటకు భగవతి నన్ను పంపినది. నేను చెప్పినట్లతఁ డక్కడికి వెళ్లినాఁడు.

బుద్ధ — అతని నక్కడికి పంపిన దెందుకే?

అవ — ఈవేళ కృష్ణచతుర్దశి కదా! శంకరపురమునకు వెళ్లే తన తల్లితో కూడా మాలతి అక్కడికి వెళ్లును. "దేవతారాధనము సౌభాగ్యవర్ధనము, నీచేతితో కోసిన పువ్వులతో పూజింపవలెను" అనిచెప్పి లవంగికను తోడిచ్చి మాలతిని కామోద్యానమునకు పంపించును. అక్కడ మాలతీమాధవులు పరస్ప

రము చూచుకొందురు. భగవతి పన్నగడ యిది — అయితే నీ వెక్కడికి ప్రయాణము — ?

బుద్ధ — నేనా ? — మనచెలికత్తె మదయంతిక శంకరపురపునకు బయలు దేఱుచు నన్నుఁ గూడా రమ్మన్నది. అందుచే భగవతికి వందన మాచరించి యాచెలి చెంత కేగ నున్నాను.

అవ — సరేకాని, పూజ్యురాలు నీకు నియోగించిన పని యెంతవఱ కైనది ?

బుద్ధ — చాలావఱకైనది. భగవతి సెలవునుబట్టి, మకరందుఁ డింత వాఁ డంతవాఁ డనుచు నేవేవో నమ్మఁదగినకథలు చెప్పి యత నిపై మదయంతికకు పరోక్షానురాగము పుట్టించుటే కాదు, అతని నెపుడు చూతునా యన్నంత యుబలాటము పుట్టించితిని.

అవ — బుద్ధరక్షితా ! సెబాసు ! ఇఁక నేమి ? మనము పోదము రా !

(నిష్క్రమింతురు — ఇది ప్రవేశకము.)

కామం — (ప్రవేశించి) మాలతి నాతో స్వేచ్ఛగా మాటాడుటకు మొదట నించుక సంకోచించెను గాని, నేను మెల్లగాఁ జేరఁ దీసి పలుకరించుచు రాఁగా, నీమైదాఱురోజులలోనే చెలికత్తె లకుం బోలె నాకు నెంతో చన వైనది. ఇపుడు—

చ. ననుఁ గని సంతసిల్లును, కనంబడకున్నను బెంగటిల్లుఁ, జె
ప్పును జెవిలో రహస్యములు, బొంకదు జంకదు, నాదుమాట కా
దనదు, మఱాని కేగవలె నంటిన, కంఠము కౌఁగిలించి "వెం
టనె యిటురానిచో గురుకటాక్షము తప్పెద" వంచు నొట్టిడున్.

ఇదిగాక, నేను చెప్పినట్లు తప్పక మాలతి నడచు నన్నునాయా శకు మంచినిమిత్తము మఱియొకటి కలదు. నేను మరల నొకసారి

శకుంతలాదుల స్వయంసమాగమవృత్తాంతములు ప్రస్తావింపఁగా, నవి యన్యాపదేశముగా తన కుపదేశించినట్లే భావించి నాయొడిలో తల పెట్టుకొని పరుండి యెంతోసేపు తదేకచింతతో కదలక మెదలక యట్లే యున్నది — కావునఁ దరువాతికార్యము మాధవుని చెంతనే జరుపుట సముచిత మని తోఁచినది.

(తెరవంక చూచి) కుమారీ! ఇట్టిటు —

(తరువాత మాలతీ లవంగికలు ప్రవేశింతురు)

మాల — (తనలో) నన్ను మానాన్న రాజుగారి కుపాయనముగా నిచ్చెనా? మాతండ్రికి రాజారాధనమే యెక్కువ, మాలతి కాదు (కన్నీరు) హాతండ్రీ! నీవు నాయెడ నిట్టి వాఁడ వగుటచే సర్వథా భోగతృష్ణ జయించిన దనవచ్చు. (సంతోషముతో) ఆమహాభాగుఁడు మహాకులప్రసూతుఁడా? ఆహా! పారిజాతము పాలసముద్రమునఁ గాక మ తెక్కడ పుట్టునని లవంగిక యెంత చక్కఁగాఁ జెప్పినది? ఆమనోహరుని మరల నేను చూతునా?

లవం — సఖీ! మిసమిసలాడు తియ్యమామిడిచిగుళ్లు కొసరు తీర మెసఁగి గొంతెత్తి కూయు కోకిల కులములకోలాహలమున కాకులపడి చెదరి యెగసిపోవు చంచరీకముల రాపిడికి రేఁగి రాలుపరాగం బుతోడి సంపంగిరేకు లంటి గుమగుమలాడు క్రొత్తావి గొని వచ్చి, జఘనోరుభారంబు సైఁపఁ జాలక యడుగులు తడఁ బడుచుండ మత్తకలహంసిమాడ్కి మందమందగతి నడతెం చుచు నలసిననీవదనేందుబింబమునిాఁదిస్వేదకణంబు లనెడి సుధాబిందువుల నంటి శీతలస్పర్శుఁడై యీకామోద్యానగంధ వహుఁడు నిన్నుఁ గౌఁగిలించుచున్నాఁడు. కావున నిటుపోదము రమ్ము.

(పరిక్రమించి యొకవంక ప్రవేశింతురు)

(పిదప మాధవుఁడు వేఱొకవంక ప్రవేశించును)

మాధ — బ్రహ్మానందము! భగవతి విచ్చేసినది —

గీ. ఒడ లుడికిపోవునట్టి మయూరమునకు
వానకును ముందు తోఁచుశంపాలతే యన,
ప్రేయసికి ముందు తాన యావిర్భవించి
కొందలంపును నామదిఁ గుదుటఁబెట్టె.

(తేఱిచూచి) అదిగో లవంగికతో మాలతియు వచ్చినది. అదృష్టము ఫలించినది. కాని, —

చ. కనుఁగొని చంద్రకాంతమణిఁ గల్వలఁజేఁడు కరాన సోఁకి నే
ర్పునఁ గరఁగించుఁగాని, యటుఁ బూఁబోఁడ డాసిన యాలతాంగియా
ననశరదిందుఁడో యిటుఁ గనంబడకుండ మదంతరంగ మిం
తనె కరఁగించి నాకుఁ గలఁతం గలిగించె మహాద్భుతంబుగన్.

ఆహా! మాలతి యింతదనుక మనోజ్ఞమూర్తి. ఇపుడో నిజముగ మనోహారిణి. ఏమన? ఆకాంచనాంగి:—

చ. నను మదిలోఁ దలంచుచు ననంగునిబారికిఁ జిక్కి స్రుక్కుఁ జొ
చ్చిననవచంపకావళిరుచిం దలపించునిజాంగవల్లరిన్
దనుపుచు నాకనుంగవ సుధారసధారవిధాన, నామదిం
గొనములఁ జొక్కఁజేయుచు రగుల్కొలిపెన్ మదనాగ్ని నల్లనన్.

మాల — చెలీ! పొట్టిగా నున్న యీపొదలోని పువ్వులు కోయుదము —

మాధ — అహో! ఇవి, అక్షరములు కావు. అమృతబిందువులే.

గీ. క్రొత్తగా వీను సోఁకునా కోమలాంగి
పలుకుఁదేనెకు నామేను పులక లెత్తె

తొలుతఁ దొల్కరివానచిన్కులకుఁ దడిసి
మొగ్గ దొడిగిన కడిమిపొంపును వహించె.

లవం — సఖీ! నీయిష్టము — (పూలు కోయుట నటింతురు)

మాధ — మాలతి కాపుష్పాపచయకార్య ముపదేశించిన పూజ్యురాలి యాచార్యక మత్యాశ్చర్య మమేయము కదా! మఱుఁగున నుండి యాసర్వాంగసౌందర్యమును మనసార నారగింపఁ గల్గితినారా!

మాల — సఖి! ఇఁక నవతలిప్రక్క నున్న పువ్వులుకోయుదమే!

కామం — (మాలతిని కౌఁగిలించి) వద్దు వెఱ్ఱితల్లీ? ఇంక వద్దు — (అని తదవయవములు తాఁకుచు)

చ. నలిఁగెను మేనిచాయ, వదనంబు చెమర్చెను, కన్నుదోయి మూఁతలు పడఁజొచ్చె, మాటలును దక్కె ఱమందుచునుండె, నందినీ!
వలవదు, పుష్పలావనము వల్లభదర్శన మట్లు గూర్చె నీ
కలయిక యింక నోర్వఁగలవా? కనవా కదుఁగందెఁ జేతులున్?

మాలతి — (సిగ్గు నటించును)

లవం — అమ్మా! పూలు కోయుట మాన్పించి యెంతేని మేలు చేసితివి.

మాధ — ఆహా! పూజ్యురాలి నర్మవచన మెంత హృదయంగమముగా నున్నది!

కామం — బిడ్డా! కూర్చుందుము. చెప్పవలసినది కొంచె మున్నది చెప్పెదను.

(అందఱు కూర్చుందురు)

కామం — (మాలతిగడ్డ మెత్తి) ఈచిత్రము విను.

మాల — సెలవిమ్ము.

కామం — నీకొకమాటు ప్రసంగవశమున మాధవునిమాట చెప్పియున్నాను. ఆకుమారుఁడు నీవలెనే నామనస్సునకు మఱియొకలంకె.

లవం — ఔనమ్మా! అట్లే, అనుకొనుచున్నాము.

కామం — అతఁడు మదనోత్సవము జరిగిననాఁటినుండి పరవశుఁడై మనస్సు కలఁతపడఁ బరితాపపడుచున్నాఁడు.

చ. మునుపటియట్లు మిత్రుఁ గని ముచ్చటలాడఁడు, నిండువెన్నెలన్
దనియఁడు, ధీరుఁ డయ్యును మనంబునతాపము వెల్వరించు దాఁ
చనలవి గానియంగముల సౌష్ఠవశోభ తొలంగుచున్కి, నై
నను గనవచ్చు నాతఁడు జనంబులకున్ రమణీయమూర్తియై.

లవం — ఔనౌను. మాధవుఁడు స్వస్థచిత్తుఁడు గాఁడని భగవతిని తొందరపెట్టుచు నపు డవలోకిత కూడా చెప్పినది.

కామం — మాధవుని మదనతాపమునకు మాలతియే కారణమనుకొనుట విన్నాను. ఆమాట నిజమే యని యిపుడు నాకును తోఁచినది. ఏమంటే—? (అని మాలతిచుబుకముపట్టి మొగ మెత్తి)

గీ. నిజముగాఁ జూచె నాతఁ డీనిర్మలేందుఁ
గానిచో, నబ్ధి సలిలంబు కలఁగఁ బాఱి
తరఁగలెగయంగ నుప్పొంగుకరణి నతని
హృదయ ముత్కంఠ మీఱఁ బై కేల యుబుకు?

మాధ — అహో! ఉపన్యాసచాతురి. ఆహా! నా కారోపించుగొప్పతనము! ఈపూజ్యురాలిశక్తి కిది యాశ్చర్యమా?

ఆ. శాస్త్రపాటవం బసాధారణప్రజ్ఞ
ప్రౌఢిమంబు చతురభాషణంబు,
సమయసముచితోక్తి సమయనిరీక్షణ
మిాప్సితార్థసిద్ధిహేతువు లగు.

కామం — అతఁడీనసుమ జీవితము మిాఁద రోఁత పుట్టి చేయరాని పను లెన్నో చేయుచున్నాఁడు.

చ. కనుఁగొనుబాలచూతకళికల్ పికమోఘుల ధిక్కరించి, నం
దనసుమగంధ మాను, మదనప్రియు మారుతుఁ డా నెదుర్కొనున్
దనువునఁ బద్మపత్రములు దాల్చియుఁ దాపము నోర్వలేక చి
చ్చునఁ బడఁగోరి మంటలనుచూపునఁ గొల్చును జంద్రుపాదముల్.

మాల — (తనలో) అయ్యో! ఇంత తెగించెనా ?

కామం — ఆకుమారుఁ డతిసుకుమారుఁడు- ఎన్నఁడు నిట్టికష్ట మెఱుఁగనివాఁడు, దయనీయుఁడు. ఈవిధముగా విరహతాప మోర్వలేక, యొకవేళ శరీరము విడిచినను విడువవచ్చును.

మాల — (జనాంతికము) సఖీ! మానవలోకమున కలంకారభూతుఁడైన యామహాభాగునికి నామూలముగా నేమిసంభవించునో యని భయపడుచున్నాను.

మాధ — పూజ్యురాలిమాటలు విని మాలతి నాయెడ జాలిపడుచున్నది. ఇది మహాభాగ్యము.

లవం — భగవతి యింతే చెప్పెను గాని, మాలతి విరహతాప మింతకు పదింతలు, తొలుత మాభర్తృదారిక వీథిలో నడయాడు మాధవుని చూచిచూచి యనురాగపరవశయై సూర్యకిరణములు సోఁకినతామరదుంపయయ్యె, కంటికి చక్కఁగానే కన

వచ్చుచుండెడిది కాని, ఈమె మదనవేదనపాలై పరితపించుచున్న దనిమాత్రము చెలికత్తెలకు తోచక పోలేదు. మాతో నాట పాటలు మానివేయుట కూడా దానిని స్థిరపఱచినది. పైగా నొకచో కూర్చుండి చెక్కిలి చేత చేర్చి యేమో యాలోచించుచుండెడిది. గృహోద్యానమునుండి వచ్చిన మందమారుతము సోకినంతనే వణకుచుండెడిది — తరువాత, మదనోద్యానము నందు మన్మథోత్సవము జరిగినపుడు, తనయుత్సవము సందర్శింప మానవరూపముతో స్వయముగా వచ్చినయనంగుడే యన్నట్లు నయనగోచరుడైన యామనోహరు నీమెయు నీమె నాతడును సన్నిధిని మనసార కన్నులార చూచుకొన్నది మొదలీనెచ్చెలి యనుభవించుచున్న యనంగదశాపరిణామము వర్ణనాతీతము. ఒకతఱిపూర్ణిమేందుని గన్న లేతతామరకాడ యన వాడిన ట్లుండెడిది. మఱియొకసారి మానసిక మైన వల్లభసమాగమ సుఖమున ముఖము చెమర్చినట్లు పెదవులు కదలినట్లు మేను పరవశ మైనట్లు దరస్మితరేఖ, గపోలములు విలసిల్లినట్లు కన వచ్చెడివి. ఆనందాస్వాదవివశ యైనయీామె కన్నులించుక ముకుళించినట్లు కనవచ్చి నప్పు డెల్ల నీమె మేన మానసికవర సమాగమలక్షణములు గోచరించుచునే యుండెడివి. ఇంకొకతఱి విరహతాపము వెల్లివిరియ సఖులు చేయు శైత్యోపచారంబులు వృథాయగుటయు, కంటికి కును కన్నమాట లేక రాత్రులకు రాత్రులే కొన్ని గడపుచుండెడిది. ఒక్కొకమాఱు తలప రాని తెలుపరాని మదనానలంబునం బడి యుడికిపోయి నిశ్చేష్టయై మామనస్సును కింకర్తవ్యతామూఢమును గావించెడిది — ఏమిచెప్పుదును భగవతీ! నిరుపమానలావణ్యమునకు నిలయము లైన యీామె శిరీషకుసుమపేశలాంగములు దారుణంబైన

మారుబారికిఁ జిక్కి యిప్పు డెట్లున్నవో చూడుఁ. ఇవి యెప్పటికి తొంటిచక్కఁదనము దాల్చి మనోరంజకము లగునోకదా! ఇంక మోహావేశతమోమయములై తోఁచుపగళ్లెట్లు గడచునో, పగలుచూపు రాత్రు లెట్లు తెల్లవాఱునో తోఁచకున్నది.

కామం—గీ. మాధవునిమీఁది యనురాగమహిమ యిట్టి
కారణం బేని, యిది గుణజ్ఞతకు ఫలమొ,
పరమసంతోషమే, కాని, బాల యిట్లు
బాధపడుచుండె నని గుండె పగులుచుండె.

మాధ — భగవతీ! మాయెడ నీ కెంతప్రేమ? మమ్ముఁగూర్చి నీ కెంత పరితాపము? ఆహా!

కామం — (మాలతివంక చూచి) ఔరా! ఎంతప్రమాదము?

గీ. ఈమె దేహము, లలితంబు కోమలంబు,
కుసుమబాణునిచర్యయా, ఘోరతరము
కాలమా, మలయానిలబాలచూత
ముకుళచంద్రాద్యనర్థసంపోషకంబు.

లవం — అమ్మా! ఇంతదురవస్థలోను మాలతి యెట్లో ప్రాణాలతో నిలచి మనకంటఁ బడుచుండుటకు దైవము రెండువిధముల మేలు చేసెను, లేకుండేనా—? చిత్తగించుతల్లీ! అందు మాధవుని ప్రతిమతోడి — యీచిత్రఫలక మొకటి (అనిచూపి, మాలతి పయఁటకొంగు కొంచెము తొలఁగించి యామెమెడలోని వకుళ మాలిక చూపి) మాధవుడు స్వహస్తములతో గ్రుచ్చిన యీపొగడపువ్వులదండ యొకటి —

మాధ—గీ. సఖి వకుళమాల ! జగతి నీసాటి లేరు
ప్రౌఢబిసకాండపాండురభాసమాన
శతసముజ్జ్వలవక్షఃపతాక యనఁగఁ
బ్రాణసఖి వైతి వీవు నాప్రాణసఖికి.

(తెరలో కలకలము — అందఱువిందురు)

ఓకుంకరపురవాసులారా ! రక్షింపుఁడు రక్షింపుఁడు. బలిసి పొగ రెక్కి గొలుసు తెంచుకొని యినుపపంజరంబు తలుపులు పగులఁగొట్టి యమర్షరోషావేశంబున బొబ్బ లిడుచు బయటఁ బడి వాయువేగంబునఁ బరుగెత్తుచు, కంటఁబడ్డజంతువులఁ గఱకుకోఱలం బట్టి చీల్చి కబళించుచు దుష్టశార్దూలం బొకండు కాలయమునిమాడ్కి స్వేచ్ఛావిహారము సలుపుచున్నది. రండు రండు ప్రాణదానము చేయుఁడు.

(తొందరగా ప్రవేశించి)

బుద్ధరక్షిత — రక్షించండి రండి రండి. కష్టము కష్టము. అయ్యో! అయ్యో! అమాత్యనందనునిచెల్లెలు నాప్రియసఖి మదయంతిక పులివాతఁ బడ నున్నది. పరిచారిక లందఱు పాఱిపోయినారు. ప్రమాదము ప్రమాదము.

మాల — అయ్యో పాపము ! చెలీ ! గొప్పకష్టము !

మాధ — బుద్ధరక్షితా ! ఆపులియెక్కడ ?

మాల — (భయహర్షములతో తనలో) అయ్యో ! ఈయన యిక్కడే ఉన్నారా !

మాధ — (తనలో) నాపుణ్యము పూచినది. తలవనితలంపుగా దగ్గఱ నున్ననన్ను మిక్కిలి యుల్లాసముతోఁ జూచుచున్న యీసరసి జాక్షి —

గీ. తెల్లతామరదండ మేనెల్ల చుట్టి,
సాంద్రగోక్షీరధారల జలకమార్చి
తనివి తీఱంగ మఱి యమృతంబు కురిసి
నన్నుఁ గంటోయితో బ్రమింగెనాఁ జెలంగు.

బుద్ధ — మహాభాగా! అదిగో! ఉద్యానము వెలుపలి దారి మొగలో—
చూడు...

మాధ — (ససంభ్రమముగా) ఇదిగో నేను సంసిద్ధుఁడను —

మాల — చెలీ! నాకు జంకుగా నున్నది.

మాధ — (కొంచెం మటు పరిక్రమించి చూచి) అబ్బా రోఁత. పేగుల ముక్కలు పోగులుపోగులై పడియున్నవి. జంతువులతేలలు వెద చల్లిన ట్లున్నవి. నెత్తుటికాల్వలచే దారి పంకిల మైనది. ఔరా! ఈదారి యెంత బీభత్సముగా నున్నది! అయ్యో పాపము! మనము దూరముగా నున్నాము. పులికి మదయంతిక దగ్గఱ యగుచున్నది.

అందఱు — హా మదయంతికా!

కామం — మాధ — (సహర్షాకూతముగా) ఔరా! పులినోటఁబడి చచ్చిన యెవనిచేతిలోనిఖడ్గమో తీసికొని మకరందుఁడు పులి కిని మదయంతికకును నడుమ దారిలో నిలిచియున్నాఁడు. ఆఁ కానీ? ఇఁక భయములేదు —

ఇతరులు — మేలు మేలు మహాభాగా!

కామం, మాధ — అద్భుత మతిభయంకరము. పంజాతో కొట్టుచునే మకరందుని కత్తిదెబ్బకు రెండుముక్కలై పులినేలఁ గూలినది.

ఇతరులు — అయ్యో! అయ్యో! మకరందుఁ డేమైనాడో!

కామం — (సాభిప్రాయముగా) శార్దూలనఖములు నాటి దేహమున రక్తము స్రవించుచున్నను, ధైర్యముతో నేల కాన్చిన చేతికత్తి యూతఁగా తూలిపోక, తొందరతోఁ బరుగెత్తుకొనివచ్చిన మదయంతిక రెండుచేతులతో గట్టిగా పట్టుకొనఁగా కుమారమకరందుఁడు నిలవఁబడియున్నాఁడు.

ఇతరులు — పాపము! దెబ్బ గట్టిగా తగిలినది కాఁబోలు! వణఁకుచున్నాఁడు,

మాధ — అయ్యో! మిత్రునికి తెలివి తప్పినది. భగవతీ! నన్ను రక్షించుము.

కామం — కుమారా! ఏ మింతగా భయపడుచున్నావు? రా! అక్కడికి వెళ్లి చూతము.

(అందఱు నిష్క్రమింతురు)

ఇది శార్దూలవిద్రావణ మను తృతీయాఙ్కము.

---

# మాలతీమాధవము

## చతుర్థాఙ్కము

(అంత మదయంతికామాలతులచే క్రమముగా పట్టుకొనఁబడి మూర్ఛిల్లిన మకరంద మాధవులును, కామందకీ బుద్ధరక్షితాలవంగికలును ప్రవేశింతురు.)

మద — భగవతీ! అనుగ్రహింపుము. ఆపద్బాంధవుఁడైన యీమహాభాగుఁడు నాకోసమిట్లు ప్రాణాపాయస్థితికి వచ్చెను. రక్షింపుము రక్షింపుము —

మాల — మిత్రునికష్టమోర్వలేక మూర్ఛిల్లిన యీమహానుభావునుద్ధరించుము తల్లీ!

బు — లవం — అయ్యో! ఎంతకష్టము? మే మిపుడిక్కడ చేయవలసిన దేమున్నది తల్లీ!

కామం — (కమండలూదకము మంత్రించి మకరందమాధవులపైఁ జల్లి) మీ రందరు చీరకొంగులతో విసరండి.

అందఱు — (అట్లు విసరుదురు)

మక — (నిట్టూర్చి చూచి) ఏమిది మిత్రమా! ఇంత భయమా? నేను తెలివిగానే ఉన్నాను. లేలే!

మద — అబ్బా!! మకరందపూర్ణ చంద్రుఁ డిప్పటికి మేలుకొన్నాఁడు.

మాల — (మాధవునినుదురు పట్టుకొని) మహాభాగా! వర్ధిల్లుము. దైవ మనుకూలించినది. నీమిత్రునికి స్మృతి వచ్చినది. లేచుకొనుము.

మాధ — (నిట్టూర్చి) సాహసాలంకారా! వయస్యా! రా రమ్ము (అని కౌగిలించును)

కామం — (ఇద్దఱిమూర్ధము లాఘ్రాణించి) దైవవశమున నాకుమారులు జీవించినారు.

ఇతరులు — మహానందము పరమానందము.

బుద్ధ — (జనాంతికము) సఖీ! మదయంతికా! ఇతఁడే నేను చెప్పిన యాతఁడు.

మద — సఖీ! ఆయన మాధవుఁడని, ఈయన నీవు చెప్పిన యతఁడేయని తెలిసినది.

బుద్ధ — అయితే, నేను సత్యము చెప్పినా నని నమ్మెదువుగదా!

మద — ఎంతమాట! మీవంటివాళ్లు మావంటివాళ్ల యెడ మఱియొకవిధముగాఁ బ్రవర్తింతురా చెలీ! సరేకాని, ఈమనోహరాకారుఁ డగుమాధవునిపై మాలతికిఁ గూడా, అనురాగ మంకురించిన దన్నప్రవాద మున్నదిసుమీ! (అనుచు మకరందునివంకఁ గోరికతో చూచును)

కామం — (తనలో) దైవప్రేరణమున మదయంతికా మకరందులపరస్పరసందర్శనసంస్పర్శనాదిక మతిచిత్రముగా మిక్కిలిచక్కఁగా జరిగినది సెబాసు! (ప్రకాశముగా) వత్స, మకరందా! ఈ విపత్సమయములో మదయంతికను బ్రతికించుటకు దైవము నిన్నెట్లు తీసుకొనివచ్చెనో కదా!

మక — ఇంతకు మున్నే నేను నగరిలోనికి వెళ్లఁగా నొకవార్త నా చెవిని పడ్డది. అది మాధవుఁడు వింటే యతనిమనస్సెట్లు కలఁతపడునో యని శంకించుకొనుచున్నంతలో, అవలోకిత కనఁబడి మన్మథోద్యానవృత్తాంతము చెప్పినది. వెంటనే బయలుదేఱి త్వరితముగా వచ్చుచుండఁగా పులిబారికి చిక్కిన యీగొప్పయింటికన్యను చూచుట తటస్థించినది.

(మాలతీమాధవు లావార్త యేమని విమర్శించుకొందురు)

కామం — (తనలో) వార్త కేమున్నది! రాజు నిర్బంధమునుబట్టి నందనునికి మాలతి నివ్వడము నిశ్చయమైయుండును. (ప్రకాశముగా) వత్సా మాధవా! మూర్ఛిల్లిన మకరందునికి తెలివి వచ్చినట్లు నీకు మంచివార్త తెల్పి నిన్ను మూర్ఛనుండి తేర్చినది —

మాలతి — ఆకుమారికి ప్రత్యుపకారముగా తగిన పారితోషిక మివ్వవలసిన సమయమిది.

మాధ — భగవతీ! మీసెలవు —

గీ. నాకుఁ జెలికాఁడు సుఖవార్త నన్నుఁ దేర్చె
నీకు బహుమాన [illegible] తగినదే మీయఁగలను ?
స్వేచ్ఛగా నాదుహృదయంబు జీవితంబుఁ
దాఁ గొనందగుఁ బూర్ణపాత్రంబుగాఁగ.

లవం — మహాప్రసాదము. మాప్రియసఖి కభీష్టమైనబహుమాన మింతకంటె వేతేముండును?

మద — (తనలో) ఈమహానుభావుఁ డెంతో మనోహరముగా హృదయ మావిష్కరించు నేర్పు గలవాఁడు.

మాల — (తనలో) మకరందుఁడు విన్నయావార్త యేమైయుండును?

పురుషుఁడు — (ప్రవేశించి) అమ్మాయీ మదయంతికా! మీపెద్దన్న అమాత్యనందనుఁడు నీతో చెప్పుమన్న మాటలు విను. "రాజుగా రిపుడే మనయింటికి వచ్చి భూరివసువుపై మంచివిశ్వాసము నామీఁద మహానుగ్రహమును ప్రకటించుచు మాలతిని నాకు స్వయముగా నొసఁగినారు. ఈవిషయము ముచ్చటించు

కొనుచు నానందింతము, ఇంటికి రమ్మ్మ" విన్నావా? ఇఁక రమ్మ్మ పోదము.

మక — వయస్యా! ఇదే నేను విన్నవార్త.

(మాలతీమాధవులు తెల్లఁబోవుదురు)

మద — (సంతోషముతో మాలతిని కౌఁగిలించి) సఖీ మాలతీ! మన మొకయూరిలో పుట్టిపెరిగినవాళ్లము, చిన్నతనమునుండి చెలి కత్తెలము. ఇంతదనుక నీవు సహోదరివంటిదానవు. ఇపుడు మాయింటికి నీవలంకారమైనావు. సంతోషము.

కామం — బిడ్డా మదయంతికా! నీయన్నకు మాలతి దొరికినది, అదృష్ట వంతురాలవు.

మద — అది మీయాశీర్వాదఫలము. లవంగికా! మీరు మాలతితో మాయింటికి వత్తురు. మాకోరికలు నేఁటితో నిండినవి.

లవం — మీసంబంధము లభించుటచే మాకోరికలును సఫలములైన వని మేమును సంతోషించుచున్నాము.

మద — సఖీ బుద్ధరక్షితా! ఆయుత్సవములో పాల్గొందము రా! (ఇద్దఱు లేతురు)

లవం — (జనాంతికము) భగవతీ! హృదయముల నిండి పైకుబికిన యాశ్చర్యానందములను మఱుఁగుపుచ్చుచున్న నేర్పున గంభీరము లయ్యును మనోహరంబులై వివిధగతుల విభ్రమించుచుఁ గలి యుచు వెనుక తగ్గుచునున్న మదయంతికామకరందుల యపాం గావలోకములనుబట్టి వీరిద్దఱికోరిక ఫలించినదని భావించు చున్నాను.

కామ — (నవ్వి) వీరు పరస్పరము మానసిక మోహనముమాత్ర మనుభవించుచున్నా రని వీరిచూపులే చెప్పుచున్నవి చూడవా? *

పుర — అనస్త్ర మనయంతికా! ఇట్టిటు —

మక — (అపవారించి) బుద్ధరక్షితా! ప్రాణదానముచేసిన యీపద్మలోచనుని మరలఁ జూతుమా?

బుద్ధ — దైవ మనుకూల మైతే — (నిష్క్రమింతురు)

మాధ — (అపవారించి) ఆహా!!

ఉ. మాలతిమోఁదియాశ నడుమం దెగె. దారముమాడ్కి నింక నా
భీలమహోద్ధతిన్ హృదయవేదన హెచ్చెనని పైకి లేచు, న
ల్లోలచలద్వికారపరిలుంఠితమై యడుగంటుఁ బ్రాణ, మిం
కేల? కృతార్థుఁ డయ్యెఁ గుసుమేషుఁడు దైవము గెల్చె నేఁటితో.

(మాలతివంక నించుక చూచి) దైవము ననవలసిన దేమున్నది.

చ. కలిసెనుగాక చిత్తము, లకల్మషమే యగుఁ గాక కూర్మియున్,
సులభము గానివాం డనుచుఁ జూడనిదోషము నాది గాన దు
ష్కుల ముచితంబె యైన నరపాలునిచర్యకు వెల్లఁబాఱుని
చ్చెలువ మొగంబుమాత్ర మెదఁ జిచ్చయి నిచ్చలు నేర్చు నన్నిఁకన్.

కామం — (స్వగతము) ఈవిధముగా విచారగ్రస్తు లైన మాలతీ మాధవులను చూచి నేను దిగులుపడుచున్నాను. ఈనిరాశను తొలఁగించుట కూడా దుష్కరమే. కానీ! చూతము. (ప్రకాశముగా) వత్సా మాధవా! చిరంజీవి వైనని న్నొక్కమాట

---

* గీ॥ కొంచెముగ వంగి యడ్డమై కూణితమయి
వలితమై నిల్చి లలితమై వక్రమగుచు
బొమలు కదలంగఁ జతురమై ముడిఁగి కూర్మిఁ
దీరెఁగద కేకరాక్షమై వీరిచూపు!

అడుగుచున్నాను — అయితే, ఇంత వఱకును భూరివసువే నీకు మాలతి నిచ్చు నని తలఁచుచున్నావా?

మాధ — (సిగ్గుతో) లేదు లేదు.

కామం — అయితే, భూరివసువు మును పెట్టినాఁడో, ఇప్పుడు నట్టి నాఁడే. ఇంకెందు కీవిచారము?

మక — మాలతి నిచ్చివేసినారు గదా యని —

కామం — ఎవ రిచ్చివేసినారు మకరందా?

మక — రాజుగారు —

కామం — మాలతిని దారవోయుటకు రా జెవఁడు? ఈమాట నేను విన్నానులే! — మాలతి నిమ్మని రా జడుగవచ్చినప్పుడు భూరివసు వేమన్నాఁడు? "మహారాజా! తమకన్యల నీయఁ దామే కర్తలు" అని బదులు చెప్పినాఁడు. ఇంతే కదా!

మక — ఔనింతే —

కామం — ఇంతకుమున్ను వచ్చినపురుషుఁ డేమనిచెప్పినాఁడు? 'రాజుగారు స్వయముగా మాలతి నొసఁగినా" రని — వత్సా విన్నావా? గృహస్థులస్వకీయవ్యవహారములలోని మాటలు వేదవాక్యములవంటివి కావు. భూరివసు వన్నమాట విస్పష్టముగా లేక కొంచెము కపటముగా నున్న దని పరిశీలించువారికి తోఁచకపోదు. అయినా, అంతా కల్లగాదు. "ఎవరి పిల్లల నీయ వారే కర్త లన్నయర్థమే యందు ప్రధానము. ఆమాటకు మాలతి మీకూఁతురే యన్నట్లు రాజుగారర్థము చేసికొన్నారు గాని, అంతమాత్రమున మాలతి రాజు కూఁతురగునా? కానేరదు గదా? ఇఁక నేమి?— పోనీ! రాజుల యను మతినే వారిమంత్రులు కన్యాదానము చేయవలె నని యెవరే

నందురా? అట్టిసమాచారమును దెల్పు శాస్త్ర మెందును గన రాదు. కాఁబట్టి, ఈకోఱ గానివార్తనుబట్టి నిరాశ చెంద నక్కఱలేదు. ఇంతకును, నేను మైమఱచి యున్నా నని తలం తువా? అ ట్లెన్నఁటికి ననుకోకు —

గీ. మాలతీమాధవులు దుఃఖమగ్ను లగుచు
నుండఁగాఁ జూచి శత్రువే నోర్వఁడింక,
నేను సహియింతునా? ప్రాణమేని విడిచి
మిమ్ముఁ గలిపెద నామాట నమ్మియుండు.

మక — భగవతీ! మీరు సెల విచ్చినమాట యెంతేని సముచితమై చిత్తశాంతిని గలిగించుచున్నది.

ఉ. ఎన్నఁడు సన్యసించితివొ యెంతవిరక్తమొ నీమనం? బహో
ఖిన్నుల వీరిఁ గాంచి కరఁగెం గరుణన్ మహనీయధర్మ మా
పన్నులరక్షణం బగుటఁ, బట్టిననీదుప్రతిజ్ఞ వృత్తికిన్
భిన్నమ మైన నిట్టు లనిపించినదైవము తోడుగా దొకో?.

(తెరలో)

భగవతీ కామందకీ! మాలతిని తీసుకొని త్వరగా దయచేయు వలసిన దని, అమ్మగారు సెలవిచ్చినారు.

కామం — కుమారీ! లెమ్ము పోవుదము.

(అందఱు లేచి పరిక్రమింతురు)

(మాలతీమాధవు లనురాగవిషాదములతో పరస్పరము చూచుకొందురు)

మాధ — కష్టము కష్టము. మాలతితోడి లోకయాత్ర ఇంతటితో సరి ఆహా! దైవదుర్విలాసము?

గీ. ప్రాణమిత్రునివలెఁ గానవచ్చి దైవ
మానుకూల్యంబు చూపుచున్నట్టు లుండి,
తుదకుఁ బ్రతికూలమై మమ్ము దుఃఖవార్ధిఁ
గూల్చె నక్కట! నమ్మించి గొంతు కోసె.

మాల — (అపవారించి) మహానుభావా! నయనానందమూర్తీ! నీదర్శన మింతటితో సరి.

లవం — ఛీ! అమాత్యుఁడు మాలతికి ప్రాణసంశయావస్థ తెచ్చిపెట్టినాఁడు గదా!

మాల — నాజీవితాశ యనుపండు చక్కఁగా ముగ్గినది. కరుణాశూన్యమైన నాతండ్రిగారి కాపాలికవ్రతము సఫలమైనది. ఆపాడుదైవము తలపెట్టినదారుణయత్నము నెఱవేఱినది. దురదృష్టవంతురాలను నేనెవరిని నిందింతును? దిక్కులేనిదానను ఎవరిని శరణొందెదను?

లవం — సఖీ! ఇట్టిటు — (పరిక్రమించి స్త్రీలు మువ్వురు నిష్క్రమింతురు)

మాధ — (తనలో) నామీఁద దయ గనుక నేను విచారించుచున్నాను గదా యని జాలిపడి భగవతి నన్నూఱడించుచున్నది, అంతే. (సవిషాదముగా) ఇం కెందుకు? అన్నివిధముల నాజన్మము వ్యర్థమైనది. ఇపుడు నేను చేయవలసిన దేమున్నది? (ఆలోచించి) మహామాంసవిక్రయముకంటె వేఱొకయుపాయము కనఁబడదు. (ప్రకాశముగా) మిత్రమా మకరందా! నీవు మదయంతికను గూర్చి వేడుకపడుచున్నావు కాదా?

మక — ఔను వయస్యా!

చ. పులి నను గొట్టఁ గాంచి వెఱపుం దిగులుం బడి పర్వొలె త్తి నా
వలనికి వచ్చుచోఁ దొలఁగఁ బాఱితినక్కొం గయినన్ గణింప కా
కులమతిఁ జేరి కష్టమునఁ గ్రుంగినన న్నిరుగేలఁ బట్టి శ్రీ
తలమృదులాంగసంగతిని దన్పిన యాచెలి నామదిం గొనెన్.

మాధ — బుద్ధరక్షితకు ప్రియసఖి యైనయారమణి నీకు దుర్లభురాలు
కాదు లే!

ఉ. ఘోరమృగంబునోటఁ బడకుండఁగఁ గాచినధీరుఁ డంచు నిన్
జేరి కవుంగిలించినసుశీల మఱొక్కనిచేయి పట్టునే?
ఆరుచిరాంగి యిప్పుడు గృహంబున కేగుచుఁ గోర్కులూరఁ గ
న్నార నినుం గనుంగొనునొయారము చాలదె నిశ్చయింపఁగన్?

సరే! మఱిలే! వరదాసింధునదీసంగమంబున స్నానముచేసి నగరికిఁ బోదము.

(లేచి పరిక్రమింతురు)

మక — ఇదే, ఆపుణ్యానదుల సంగమస్థలము. చూడు మాతీర్థము హృదయము నెట్లాకర్షించుచున్నదో!

చ. బడలిక తీఱఁ జల్ల నగుపావనవాహినిఁ దీర్థమాడి, యా
తడిసినసన్నచీరలు యథాంగముగా నొడ లంటుటన్ దొడిం
బడ రుచిరాంగసౌష్ఠవము పాణిసరోజ ముహోజ లక్ష్మికిం
దొడవుగఁ బైకి వచ్చుపురతోయజనేత్రలసొంపు లొల్కుచున్.

(అని యందఱు నిష్క్రమింతురు)

ఇది శార్దూల విభ్రమ మను చతుర్థాంకము.

# మాలతీ మాధవము

## పఞ్చమాఙ్కము

### విష్కంభము

(తరువాత భయంకరరసముజ్జ్వలవేషయగు కపాలకుండల ఆకాశయానమునఁ బ్రవేశించును.)

కపా—సీ. నాభ్యాది శీర్షాంతనాడికాచక్ర ప్ర
ధానహృచ్చక్రమధ్యస్థితుండు
నిశ్చలచిత్త నిర్నిద్ర యోగిజ్ఞాన
నేత్రనిరంతరాన్వేష్యమాణుఁ
డాత్మస్వరూప బోధారూఢ యోగుల
కష్టభూతు లొసంగు నవ్యయుండు
జ్ఞానక్రియేచ్ఛాత్రిశక్తి సంపన్నుండు
బ్రాహ్మ్యాదిశక్తివిభ్రాజితుండు

గీ. జంగమస్థావరాత్మకజగతిమూల
మఖిలభూతాంతరాత్ముఁ డనాద్యనంతుఁ
డణువుకంటెను బరమాణువైనశివుఁడు
శక్తినాథుండు వెలయు విశ్వంభరుండు.

(తీవ్రదృష్టింజూచి) నేనిపుడు—

చ. నియమముతో శివున్ హృదయనిష్ఠుఁ గనుంగొనుచున్, జయించి యిం
ద్రియముల, వాయువున్ బయికిఁ ద్రిప్పుచు దైహికభూతశక్తులన్
బయి కెగయంగఁ జేసి, గగనంబున మబ్బులఁ జీల్చికొంచు నేఁ
బయన మొనర్చి వచ్చితిఁ గపాలవినిర్మితకంఠమాలతో.

గీ. కంఠమాలాకపాల ఘర్ఘరరవంబు
తన్మిళితకింకిణీ మృదుధ్వనియుఁ గలసి,
అతిభయంకర మతిమనోహరము గాఁగ
వింత లాలికించె నాయాన వేగ మిప్పుడు.

మఱియు నాగగనగమనజవాతిరేకంబున —

చ. జడముడి గట్టి దయ్యు దిగజాఱఁగ నట్టుటుఁ దూలె నాజటల్,
కడువడి మ్రోఁగె నాడమరుకంబునఁ గట్టికంచుగంట, నె
వ్వడిని గపాలరంధ్రగతవాయువు జుమ్మని వీవ మూఁపునన్
దడఁబడుకట్టకై దువుపతాకయు నాట్య మొనర్చెఁ బైపయిన్

(పరిక్రమించి చూచి) ఇది పితృవనము పాఁతి వేపనూనెలో నూరఁబెట్టి వేఁచిన సీరుల్లిపాయలరసమునట్లు కంపు గొట్టుచున్న పొగను బట్టి యిదే శ్మశానవాటికయని తెలియుచున్నది. దీని దగ్గఱనే కరాలాయతన మున్నది. అందే మాగురు వైన అఘోరఘంటుఁడు మంత్రసిద్ధికై జపించుచుండెను. ఆయనయానతినిబట్టి నే నిపుడు పూజాద్రవ్యములఁ సమకూర్పవలసియున్నది. "పిల్లా కపాలకుండలా! మంత్రసిద్ధి నభిలషించి భగవతి యైనకరాలాదేవికి స్త్రీరత్నమును బలియిత్తు నని మున్ను మ్రొక్కుకొని యున్నాను. అట్టి కన్యారత్న మీనగరిలో నున్న దని విన్నాను. దానిని తెచ్చియి"మ్మని మాగురువు సెలవిచ్చెను గదా! (అనుచు సకౌతుకముగా ముందు చూచి) కుటిలకుంతలములు చేర్చి వేసినజుట్టుముడితో కుడిచేతఁ బట్టనకత్తితో నిందరుదెంచునీమనో హారాకారుఁ డెవఁడై యుండును?

(మరలనిరీక్షించి)

చ. కలువలచాయ మేనిరుచి, కల్వలఱేఁడు మొగంబు, జంకుకొం
కులు నడకం గనంబడవు, కుఱ్ఱఁడె, యైనను సాహసక్రియన్

సలుపఁగఁ బూని కావలె శ్మశానముఁ జొచ్చె నొకింతరక్తపం
కిలనరమాంస మయ్యెడమ కేలను గైకొని, యేమిహేతువో ?

( నిరూపించి ) సరే తెలిసినది. ఇతఁడు కామందకీ మిత్రుఁ డగు దేవరాతునిపుత్త్రుఁడు మాధవుఁడు. మహామాంసము విక్రయింప వచ్చినాఁడు. పోనీ వీనితో నేమి? నాపని నేను చూచుకొందును. సాయంసంధ్యాసమయము గూడ గతించినట్లే. అదిగో !

చ. దెసలఁ దమాలగుచ్ఛవితతిం గయిసేసెఁ దమోలతావళుల్
వసుమతి స్నాన మాడ దిగవచ్చెఁ దమోమయనవ్యవారిధిన్
విసరెడు నాల్గుగాలులకుఁ బేరినధూమముమాడ్కి నలుపుం
బస లెసలార రాత్రి గనవచ్చెను క్రొత్తనె యౌవనంబునన్

( అని నిష్క్రమించును. )

ఇది విష్కంభము

( అంతఁ బూర్వోక్తవిధముగా మాధవుఁడు ప్రవేశించును )

మాధ — ( అణఁగినకోరిక పైఁ కుబుకఁ గోరికతో )

ఉ. కూరిమి మీఱునాచెలియ కుల్కును సిగ్గును మొల్కనవ్వు శృం
గారవిలోకనంబు సమాకారము నాకిపు డబ్బెఁగాక, క
న్నారఁగఁ జూడ కున్నవలపా రినచేష్టల నెంచి నైన వే
సారిననామనంబు సుఖసాగరమందు లయంబు నొందెడున్.

మరియు నింకొకటి —

గీ, కంఠమూలంబునందు మొగంబుఁ జేర్చి
పొగడసర మొప్పునుర మురంబునను గూర్చి
గాఢముగ నన్నుఁ బ్రేయసి కౌఁగిలింప
సంగవినిమయసుఖము మాకలరుఁగాక.

(ఊహించి, తలపంకించి) అబ్బో! ఇదెక్కడ? రిత్తకోరిక లకు హద్దు లేదుగదా! పోనీ ఇది మాత్రము కోరెదను—

చ. అమలసుధాంశుబింబ మన సంగజుభవ్య గృహంబనంగ, నా
కమలదళాక్షి మోము సముఖంబున నెయ్యెడఁ గాంతు నేని, జ
న్మమున లభింపఁబోవుసుఖమార్గము లన్నిటఁ గల్గునట్టి సౌ
ఖ్యము సకలంబు నేనిపుడు గాంచినయట్టులు సంతసించెదన్.

నేను మున్ను కన్నారఁ గనుఁగొన్న నాప్రియురాలే యిపుడు సరిగా నా కగపడుచున్నది. అయితే, ఈసందర్శనము భావనాకల్పితము గాని సత్యము కాదు — ఇదే చిన్న భేదము. పూర్వము నేనా సుందరాంగిని సవిశేషముగాఁ గాంచుటచే మనస్సున కంటియున్న తదీయసౌందర్యానుభవ మాప్రియురాలిని నిరంతరము స్మరించుచువచ్చుటచే దృఢపడి యిపుడు నాచైతన్యమునే మాలతీమయముఁ గావించినది. ఎట్లనఁగా?—

ఉ. లీనత నొందుచున్ బ్రతిఫలించుచు దాఁగుచు నున్నయూసరో
జానన నామనంబున సుమాస్త్రుఁడు వ్రాసినయట్లు చెక్కిన
ట్లానఁగఁబట్టిన ట్లతికిన ట్లలుఁగుల్ బిగియించినట్లు మ
ద్ధ్యానబలిష్ఠతంతుతతి నంటఁగఁ గుట్టినయట్టు లొప్పెడున్.

(తెరలో కలకలము)

మాధ — ఓహో! రాక్షసపిశాచగణము లిట్టటు తిరుగుటచే నీశ్మశానప్రదేశము భయంకరముగానున్నది — మండుచున్న సొదల వెలుఁగును మాత్రము గనఁజేయుచుఁ దక్కినప్రదేశ మంతట గాఢాంధకారము క్రమ్ముకొనియున్నది. కటపూతనాదిపిశాచ భూతములు సంతోషముతో గంతులు వేయుచుఁ గేకలు

వెట్టుచు గోడచేయుచున్నవి — ఇదేసమయము నేను గొంతెత్తి ఘోషించెద — ఓకటపూతనాదులారా!

గీ. శస్త్రపూతంబు గాదు మోసంబు గాదు
కపట మేమియుఁ గాదు, నిక్కంబు వినుఁడు,
పురుష దేహంబులోనిది దొరక దెందు
కొనుఁడు కొనుఁడు మహామాంసమును గొనుండు.

(తెరలో మరలఁ గలకలము)

మాధ — నేను గట్టిగా ఘోషించినపిదపనే యీప్రదేశమంతయు నిపుడిపుడు వచ్చిన భూతప్రేతపిశాచముల భీషణతుములారావంబున నవ్యక్తకలకలధ్వానంబున మాఱుమ్రోఁగుచు వాటి సత్వరసంచారంబునఁ గదలిపోవు చున్నట్లున్నది. (అటుచూచి) అవి విద్యుత్కాంతులా? (పరిశీలించి) కాదుకాదు —

గీ. నిడుదకోఱలు చెవులంటువెడదనోళ్లు
మెఱయుమీసాలు గడ్డాలు మిట్టగుడ్లు
పొడుగుగా నల్లగా నున్న బడుగొడళ్లు
నడరఁ దిరుగాడు కొఱవిదయ్యాలవెలుఁగు.

(ప్రక్కకుఁ జూచి) ఆహా! వీనితొందర వింతగా నున్నది.

గీ. శవములం దినుచో నోరు జాఱి పడెడి
కండప్రేవులు వృకజంబుకములు తినఁగ
విడిచి, పిక్కబలంబునఁ బేరుగన్న
పూతనపిశాచములు వేగపోవుచుండె.

(నలుదెసలు చూచి నవ్వుచు) అహో! పిశాచముల విలక్షణరీతు లెంతవింతగానున్నవి?

గీ. నాలుకలు వ్రేలఁ గోలమొగాలు తెఱచి
బక్కచిక్కినదయ్యాలు భయము గొలుపఁ
గొండచిలువలు తిరుగాడు కోటరంబు
లలరుకాలినచెట్ల కీ డగుచు నిందు.

( పరిక్రమించి చూచి ) అబ్బా రోఁతరోఁత! ఎదుట ప్రేతరంక
మనుపిశాచముచేయుచేష్ట యెంత బీభత్సముగా నున్నదో!

గీ. శవముత్తో లొల్చి మొదట నంసములకండ
పిదప జఘనోరుజంఘాదిపిశితముఁ దిని,
యంత్ర నాంత్రాదిమాంసంబు నారగించి
వెనుక నెముకలనంజుడు తినఁగఁజొచ్చె.

( తేఱి చూచి ) ఛీ! ఆపిశాచకృత్యము మఱియు బీభత్సము—

గీ. కాలుచున్నశవంబులకాలు కేలు
తలయు మొండెంబుఁ బట్టి యీవలికి లాగి
కాఁగి పొంగుచు సంధులు గడచి చిమ్ము
క్రొవ్వుధారలు త్రాగెడుఁ గోర్కి మీఱ.

( వేఱువంకఁ జూచి నవ్వి ) శవశరీరాంగములే భూషణములుగాఁ
దాల్చిన యీపిశాచుల ప్రదోషకాలప్రమోదము నవ్వు పుట్టించు
చున్నది. ఔరా సెబాసు!

చ. కరములు కమ్మ, లాంత్రములు కంకణముల్, రుధిరంబు బొట్టుగా,
నరములు తోరముల్, హృదయనాడులు హారముగా ధరించి, క
ర్పరచషకాల మజ్జసురఁ బట్టి చెలంగి పిశాచకాంత లా
ధరమునఁ గాంతులం గలసి త్రాగుచునుండిరి మత్తచిత్తలై.

( పరిక్రమించి చూచి ) "శస్త్రప్రాతంబుగాదు మోసంబు గాదు" ( అనుచు పఠించి ) ఆహా! ఏమిది? వేషభాషాచేష్టల వెఱపు గలిగించు నీపిశాచము లన్నియు నొక్కమాఱే మొగిరి పాఱిపోయినవి. ఇ దేమి వింత? ఛీ! ఇవి వట్టిపిఱికిపందలు — (సనిర్వేదముగా) ఈప్రదేశ మంతట సంచరించి ఘోషించితిని. అయితే నేమి? నేను వచ్చినపని నిష్ఫల మైనది — పోనీ! ఇంకా ప్రేతభూమి మిగిలి యున్న దేమో తిరుగుదునన్న, అదియును గనంబడదు — ఏమనంగా —

ఉ. దీనికిఁ జెంతనే యెదుటఁ దీవ్రగతిప్రసరజ్జలోర్మిని
స్వానము తజ్జవోల్లుఠదసంఖ్యకపాలరవంబు నొప్ప నే
దో నది పాఱుచున్నది, తదున్నతతీరచరత్సృగాలసం
తానము ఘూకసంతతి యొనర్చెడికూఁతలువీను సోఁకెడున్.

( తెరలో )

హా నాయనా దయాహీనా! నీవు రాజుగారి యనుగ్రహము సంపాదించుకొన సాధన మైన నీ కూఁతు రిపుడు మృత్యుముఖమునఁ బడుచున్నది లే!

మాధ.— ( సాకూతముగా విని )

మ. కలఁతం జెందినక్రౌంచికూజితమునాఁ గర్ణంబులన్ సోఁకువి
హ్వాలకంఠం బిది మున్ను విన్న దనుభావం బొప్ప నాచిత్త మా
కుల మయ్యెన్, వణఁ కెత్తె నంగములు, నీఘోరప్రదేశంబునన్
బలి గా నున్నపడంతి యేడు పని నేభావింతు నిక్కంబుగన్

గీ. ఇదె కరాలాఖ్యకాళికాసదన మిచట
జంతువుల బలి యిత్తురు శాక్తజడులు

వచ్చె నీయార్తనాద మీప్రక్క నుండి
సంశయం బేల నాయూహ సరి యనంగ?

కానీ చూచెద! (పరిక్రమించును)

(అంత, కాళికాదేవి సన్నిధిపం ద్వారపడుచున్న కపాల కుండలాఘోరఘంటు లను కాపాలికులును వధ్యచిహ్నముల తోడిమాలతియుఁ బ్రవేశింతురు)

మాల — నాయనా కరుణాహీనా! నీవు నీజేని కిచ్చినయుపహారము దేవికి బలియగుచున్నది. హా! అమ్మా! నాకై బెంగపెట్టుకొని మనస్సులో కుళ్లిపోవుచుందువు. ఓతల్లీ మాలతీమయజీవితా కామందకీ! నాకు వివాహోత్సవము కలిగింప యత్నించునీకు నామీఁదిస్నేహమే దుఃఖముగా పరిణమించినది. హాప్రియసఖి లవంగికా! నన్నింక నీవు కలలోఁ గాంచుచుందువు. హా! దైవమా!

మాధ — అమ్మయ్య!! ఇపుడు నాయనుమానపిశాచము వదలినది. మాలతే మాలతే, అయితే, ప్రాణాలతో నుండఁగా నాసుందరాంగిని జూడఁగలుగుదునా?

(వడిగా నడచును)

కాపా — (అంజలి ఘటించి) దేవీ! భగవతీ! కాళీ! కరాలా!

సీ. పాదఘట్టన దిగ్గజాలు భూగోళంబు
నొత్తడిఁ గూర్మంబు తత్తఱిల్ల
దానివెన్నున నుండి తడఁబడి జాఱిన
బ్రహ్మాండఖండంబు వణఁకుచుండ,
పాతాళకుహరనిభం బైనపుక్కిట
సప్తార్ణవంబులు సందడింప,

హ స్తిచర్మం బె త్తి యాడుచోఁ గొంగోళ్లు
తగిలి చంద్రునియమృతంబు తొరఁగ
దానిసోఁకున మాళిదండలోని కపాల
సరణి చండాట్టహాసం బొనర్ప,
ఆహాసమునకు భూతావళి భయ మంది
శరణంచు వంగి యంజలులు గూర్ప
శ్వసదహీశ్వర విషజ్వాలావృతభుజంబు
లాడించుచోఁ గొంప లదరి పడఁగ,
జ్వలదనలాక్షి మ స్తక కాంతి రేఖ యా
లాతంబు నా దిశ ల్గలయఁ దిరుగ,
ఖట్వాంగశృంగసంగధ్వజోద్ధూతమై
తారాగణంబు చిందాడుచుండ,
శితికంఠపరిషదాసీనమహామహుల్
చేష్టలు దక్కి జేజేలు వెట్ట
పరితుష్ట బేతాళకర తాళనినదంబు
తీవ్రమై దెసలఁ బ్రతిధ్వనింప
అది విన్న గౌరిగాఢాలింగనంబున
కమ్మ మేహేశ్వరుహృదయమ్ము పొంగ,

గీ. తల్లి? నీ వొనరించిన తాండవంబు
దలఁచి మే మాచరించువందనము లివిగో!
అమ్మ! నీ తాండవంబు మా కఖిలశుభము
లలర నొసఁగుచు నశుభంబు లణఁచుఁ గాక.

( అనుచు నభినయింతురు )

మాధ — ( అటు చూచి ) అయ్యో ప్రమాదము!

చ. గురుతరకీర్తి భూరివసుకూతురు రక్తవిలేపమాలికాం
బరములు వాల్చి, లేడి పులిపా లయినట్టులు పాపకర్మని
ర్భరు లగుదుష్టశాక్తులకరంబులపాల్పడి మృత్యువక్త్రగ
హ్వరమును జొచ్చి యుండె నకటా విధి యెంతదయావిహీనమో.

కపా — గీ. మరణ మాసన్న మయ్యె నమ్మా కుమారి!
సమయ మిదియిష్టదేవతాస్మరణమునకు.

మాల — హా దేవా మాధవా! నేను పరలోకమందున్నా, నన్ను
సర్వదాస్మరించుచుండుము. వల్లభునిస్మృతిపథంబున నుండుట
యిహలోకమున జీవించి యుండుటయే.

కపా — అయ్యో! ఈపిల్ల మాధవుని ప్రేమించి యున్నది.

అఘో — (కత్తి యెత్తి)

గీ. భగవతీ! కొనుమమ్మ! జపంబు సేయఁ
బూని నీ కీయఁ జేర్కొన్నకాను కిదిగో.

మాధ — (తటాలున సమీపించి వాని కత్తితోడి పిడికిటిని తనముంజే
తితో విసరికొట్టి) ఛీ పాపాత్మా కాపాలికాధమా! దూర
ముగా నుండుము. నీ విపుడు చత్తువులే!

మాల — (గబాలున వచ్చి మాధవుని గాఁగిలించి) మహాభాగా!
రక్షించు రక్షించు.

మాధ — భాగ్యవతీ! ఇంక నీ కేమీ భయము లేదు.

శా. ప్రాణాపాయము సిద్ధమైన తఱి "దేవామాధవా" యంచు నె
వ్వానిం జేర్కొని కోర్కె తెల్పితివొ, నిర్వ్యాజానురాగుండు ని
న్నే నిత్యంబు తలంచునాతఁ డిపు డిందే నీకుఁ బ్రత్యక్షు, మీ
హీనుం డీనరరూపఘాతుకమృగం బింకేగు దుర్లోకమున్.

అఘో — ఛీ! ఎవఁ డీపాపాత్ముఁడు? మనకు విఘ్న దేవతగా దాప
రించినాఁడు.

కపా — గురువరా! ఇతఁ డీకన్య వరించినవాఁడు, కామాందకీ మిత్రుని
కొడుకు, మహామాంస మమ్మ వచ్చినవాఁడు, మాధవుఁడు.

మాధ — (కన్నీరువిడిచి) సాధుశీలా! ఏమిటిది?

మాల — (నిశ్వసించి) మహాభాగా! నా కేమీ తెలియదు. మేడ
మీఁదిగదిలో పడుకొన్నాను ఇక్కడ లేచినాను. ఇంతే — మీ
రెందు కిక్కడికి వచ్చినారు?

మాధ — (సిగ్గుతో)

గీ. నిన్నుఁ బెండ్లాడి సుఖయింతు నన్నయాశ
యణఁగి పోవ మహామాంస మమ్మఁ జూపి
యిందు తిరుగుచునుండ నీయేడ్పు నాదు
చెవిని బడె, నంత నిచ్చోటు చేరినాఁడ.

మాల — (అపవారించి) ఏమిటీ! ఈమహానుభావుఁడు శరీరవాంఛ
విడిచియిందు తిరుగుటకు నేనే కారణ మైతినా? అయ్యో!

మాధ — ఈసమావేశము కాకతాళీయము. ఆహా! దైవసంఘటన —
ఇపుడు,

చ. ఓహరిణాక్షి! యీఖలునియుద్యతఖడ్గముఁ(వేటునుండి నిన్
రాహువునోటిచంద్రకల నా విడిపించిననామనంబు ను
త్సాహము విస్మయంబును విషాదము కోపము వేడ్క జాలి సం
దేహము నాక్రమించినవి తెల్పఁగఁ జాల నిదేమి చిత్రమో!

అఘో — అరే బ్రాహ్మణడింభ!

మ. పులికిం దక్కుమృగిం దలంచుమ్మృగ మన్యోక్తి, నీకన్యకన్
బలియీ నెంచిననాకు దేవిగుడిలోఁ బ్రత్యక్షమైనావు, మే
ల్బళి! నాశాతకరాలహేతిని గరాలాదేవికిన్ మున్ను నిన్
బలిగా నర్పణచేసి చూపెదప నీబాలన్ సమర్పించెదన్.

మాధ — ఓరీ! దురాత్మ పాషండచండాలా!

మ. జగతిన్ రత్నవిహీనఁ జేయ, నణఁపన్ సంసారసారంబు పె
న్పగలన్ జంపఁగ బాంధవాళి, జగము న్గావింప జీర్ణాటవిన్.
బగటిన్ జీఁకటిసేయ నిష్ఫల మొనర్పన్ గన్నులన్, మన్మథున్
దిగులొందింపఁగ నెట్లు సిద్ధపడి యుద్రేకించితో దుర్మతీ!

ఓరీదుష్టకాపాలికా నీపాపమునకుఁ దగినఫల మనుభవింతువు

మాధ — (ఎడమచేయి విసరుచు)

గీ. సఖులు విసరుశిరీషపుష్పములు తగిలి
కందునీతన్విమేనిపైఁ గత్తి యెత్తి

---

* సీ. లోకత్రయంబున నేకైకరత్నంబు
సారం బనాదిసంసారమునకు
సకలజగత్ప్రకాశక దివ్యతేజంబు,
ప్రాణబంధన మెల్లబంధుతతికి,
కందర్పదర్పవిక్రమమోహనాస్త్రంబు
మానవనయననిర్మాణఫలము.
భూతలంబున నుద్భూతనందనవాటి
బ్రహ్మసంకల్పప్రభావమహిమ
గీ. అనెడి యిమ్మణిదీపిక నపహరించి
కాటకిం దెచ్చి యార్పి జగంబు నెల్లఁ
గటికిచీఁకట్ల దిగఁ ద్రొక్కి కాడొనర్పఁ
జాతువే? నరఘాతుకా ఘోరహాతక!

మెగురునీనె త్తి నిపుడు నాయెడమచేతి
గుద్దుతోఁ బగులఁగొట్టి నిన్ గూల్చువాఁడ.

అఘో — ఆఁఆఁ! కానీ! కొట్టు కొట్టు నేఁటితో నీకాయువు మూఁడి నది లే!

మాల — నాథా! సాహసము వద్దు. ఊరకొమ్మఁడు. వీఁడు పరమ దురాత్మ్గుఁడు. ముం దీకసాయిసాలనుండి తప్పించి నన్ను రక్షింపుఁడు.

కపా — గురువరా! జాగరూకుఁడవై నేర్పుతో నీకుటిలాత్ముని కూలఁ గొట్టుము.

మాధ, అఘో — (మాలతినిగూర్చి, కపాలకుండలనుగూర్చి క్రమముగా)

గీ. భీతి నీ కేల? వీఁడు నాచేతఁ జచ్చు
నీధరాస్థలి నెందేని యెన్నఁడేని
కరికలభకుంభవిదళనఖరనఖరము
హరి నెదుర్కొనఁ జాలునే హరిణశిశువు?

( తెరలో కలకలము — అందఱు విందురు )

మాలతిని వెదుక వచ్చినవీరభటులారా! రండు రండు. అమాత్య భూరివసువు నూఱడించుచున్న ప్రజ్ఞాచక్షు వగుకామందకి కరాలాయ తనమును ముట్టడింపుఁ డనియాజ్ఞాపించుచు నిట్లు సెలవిచ్చినది. రండి రండి వినండి —’

గీ. ఘోరుఁ డతినీచుఁ డైన యఘోరఘంటుఁ
డొక్కఁడే యిందు కర్తఁ డన్యుండు కాఁడు,

కన్యకాహరణంబునఁ గారణంబు
దేవతార్పణ మనియె నాభావనంబు.

కపా — గురూత్తమా! మనలను భటులు పరివేష్టించినారు.

అఘో — కానీ! మఱీ మంచిది. వారియెదుటనే నాపౌరుషము చూపించెద.

మాల — హాతండ్రీ! హాభగవతీ కామందకీ!

మాధ — సరే. మాలతిని బంధువులదగ్గఱఁజేర్చి, అందఱియెదుటనే యీమూర్ఖుని సంహరించెద. (మాలతి నటు పంపి పరిక్రమించును)

మాధ, అఘో — (ఒకరి నొక రుద్దేశించికత్తి జడిపించుచు) ఓరీ పాపవర్తనా!

గీ. వజ్రసంకాశ మైననావాఁడికత్తి
నీదునెత్తుటిధారలు నింగి కెగయ,
కండ లెముకలు చెదరి నల్లడలఁ బడఁగ,
నఱకి నీమేను కఱకఱఁ దఱుఁగు నిదిగో!

(అని యందఱు నిష్క్రమింతురు)

ఇది శ్మశానవర్ణన మను పఞ్చమాఙ్కము.

---

# మాలతీ మాధవము

## షష్ఠాఙ్కము

### విష్కంభము

( తరువాత, కపాలకుండల ప్రవేశించును )

కపా — ఓరీ నిర్దయా మాధవహతకా! మాలతికొఱకు మాగురువును వధించినపాపివి. ఆయుద్ధసమయమున నేను నిన్ను గట్టిగా కొట్టినా, ఆడది యని నన్ను చంపక విడిచిపెట్టినావు. (కోపముతో) నన్నవహేళనచేసినందుకు తగినఫలము తప్పక యనుభవింతువులే! మగ ౘౘు జంపినవానికి మనశ్శాంతి యెక్కడిది? వాని నదను కనిపెట్టి యెన్నఁటికైన నాఁడుౘౘు కఱవక విడిచిపెట్టదు.

( తెరలో )

చ. గురువులు చెప్పినట్లు సమకూర్పుఁడు సర్వము రాజులార! భూ
సురవరులార! మీరు శుభశోభనమంత్రములం బఠింపుఁడీ
స్వరగతు లాటపాటలపసల్ వెలయింపుఁడు గాయకుల్ నటుల్
త్వరితమె పెండ్లిపందిటికి వత్తురుగా మగపెండ్లివారికన్.

వారు కల్యాణవేదికమీఁదికి వచ్చులోపల, చిరంజీవిని మాలతి వివాహము నిర్విఘ్నముగా నెఱవేఱుటకై నగరదేవతాలయమున కేగి, అమ్మవారికిమ్రొక్కి రావలె ననియు, చక్కఁగా నలంకరించుకొన్నపరిజన మాకుమారి ననుసరించి యుండవలె ననియు భగవతి కామందకి సెల విచ్చుచున్నది.

కపాల — ( అంతయు విని ) సరేకానీ! ఈమాలతీవివాహసందర్భమున సత్వరులైనప్రతీహారపరిజనులసందడి హెచ్చుగా నున్నది. నే

నిక్కడనుండి నే [illegible] యి మాధవోపకార మొనరింపనప్రమత్తనై యుండెద. ( [illegible] యించును )

ఇది విష్కంభము

కలహంసుఁడు — ( ప్రవేశించి ; నగరదేవతాగర్భాలయములో మకరందునితోఁ గలిసి యున్న మాధవుఁడు, మాలతి యీదారిని వచ్చుచున్నదో లేదో చూచుచుండు మని నాకు సెలవిచ్చెను. ఆయనకు మంచివార్త తెలిపెదను గాక.

( అంత మాధవమకరందులు యథోక్తముగా ప్రవేశింతురు )

మాధ — ( నిశ్చలదృష్టితో ) మకరందా !

మ. పువుఁదోటం గుసుమేషుసమ్ముఖమునం బూఁబోడివాల్చూపెదం
దవులం బుట్టి తదాదిగాఁ బెరిగి తత్కాంతిన్ విజృంభించి పైఁ
గవియం బూనినకామవహ్నిశిఖ యాకామందకీనీతిప
ర్యవసానం బెటులుండనీ ! యిచటఁ జల్లారున్ సమూలంబుగా.

మక — పూజ్యురాలి యమోఘమేధాశక్తి వే అగునా మిత్రమా !

కల — ( సమీపించి ) దైవము సఫల మైనది. మాలతి యిటు బయలు దేఱినది.

మాధ — నిజ మేనా ?

మక — అంతనమ్మకము లేక యడిగెద వేల ? బయలుదేఱుట కాదు, దగ్గరకే వచ్చినది. ఎట్లు తెలిసిన దందువా !

గీ. ఘనఘనాఘనగర్జితం బనుకరించు
వివిధమంగళవాద్యగంభీరరవము

శ్రుతిపథంబున నితరంబుసోఁకనీక
తాన యై తోఁచి మఱిమఱి దగ్గఱయ్యె.

రా! అటు వెళ్లి కిటుకీసందులనుండి చూతము.

( అట్లు చేయుదురు )

కల — ఆకాశముపై నెగురుచున్న రాజహంసలో యన నిట్టటు విభ్రమించువింజామరలగాలివిసురునఁ గదలి యాడుచున్న పతాకలు తరంగములుగా నలరుగగనాంగణసరోవరమండలివికసితపుండరీకములో యనవిలసిల్లెడియా వెల్లగొడుగులగుంపులు చూచితిరా ప్రభూ! మఱియు, తమరత్నాంబరాభరణకిరణజాలము లాకసమున నింద్రధనుస్సులవలె గోచరింప నమలినతాంబూలములతో నిండినబుగ్గలు పైకుబుకఁ మాట తొట్రుపడ మంగళగీతములు పాడుచున్న వారాంగన లెక్కి వచ్చుచున్న యాఁడేనుఁగులు కనకకింకిణీజాలంబు కలకలనాదం బొనరింప మందగమనంబున నేతెంచువిలాసంబు లాలోకింపుఁడు మహాత్మా!

( మాధవమకరందులు సకౌతుకముగాఁ జూతురు )

మక — ఓహో! అమాత్యభూరివసువునైశ్వర్యము వాంఛనీయము గదా!

చ. చెలఁగెడునీలకంఠముల చెల్వొప్పు వన్నెలతోడిపాలపి
ట్టల నునుపారు రెక్కలబెడంగులొ, చిత్రితచీనవస్త్రపుం
దళుకులొ, యింద్రచాపములొ నా న[illegible]వెంచిచెకిపెంక్కి[illegible]
పులు గురిపించు రత్న[illegible]ంబు [illegible]వ్వె నల్గ[illegible].

కల — ఏమిటి? తొందరపాటు[illegible]తో వచ్చె[illegible] [illegible]పలు బంగా[illegible]బెత్తపు లతోను వెండికఱ్ఱల[illegible]తోను, ఇవి [illegible] వాఁగూడ దని గీచిన

గీతల కావలనే పరిజన మంతయు నిలచిపోయినది. అతికుతూహలముతో నిరువంకల నిలచినజనసమూహము కన్నులు తెఱచి చూచుచుండ, సిందూరాంచితముఖమును నక్షత్రమాలాలంకృతము నైనకరేణువు నెక్కి, చిక్కి తెల్ల నైనచెక్కిళ్లు విరహవేదనను దెలుపుచుండ పాడ్యమినాఁటిచంద్రరేఖవలె విలసిల్లు మాలతీకన్యామణి సమీపించుచున్నది.

మక — వయస్యా మాధవా! చూడు చూడు —

చ. పరిణయమంగళాభరణభారము దాల్చి మనోజవేదనా
భరకృశపాండురాంగరుచిపాల్పడునీసరిక్రొత్తపెండ్లికూఁ
తురు నన లెత్తుచుండి కృమిదోషవిశోషిణి యైనబాలవ
ల్లరివలెఁ దెల్పు బైపయి విలాసము హృద్గత మావిషాదమున్.

ఆఁ! ఏనుఁ గాఁగి క్రిందికి వంగినది.

మాధ — (ఆనందముతో) ఏనుఁగు దిగినమాలతి భగవతీలవంగికలతో నిటు వచ్చుచున్నది.

(అంత, కామందకీమాలతీలవంగికలు ప్రవేశింతురు)

కామం — (సంతోషముతో మాలతి వినకుండ)

ఉ. శ్రేయ మొసంగుఁగాత దనచేసినసృష్టికి ధాత నాకుఁ దో
డై, యిపు డీవధూవరుల యాసలు దీర్తురుగాత దేవతల్,
పాయనికూర్మిమిత్రులయపత్యములం గవగూర్తు నన్న ని
శ్చాయక మైననాప్రతిన సన్నుతి కెక్కఁగ సిద్ధి గాంచుతన్.

మాల — (తనలో) నే నిపు డేయుపాయమున మరణసౌఖ్యము గాంచఁగలను? అయ్యో! అభాగ్యురాల నగునా కభిమత మైనమరణముకూడా దుర్లభ మగుచున్నది.

లవం — అనుకూలుఁ డైన మనోహరుని యెడఁ బాటు సహింపఁజాలక ప్రియసఖి క్లేశపడుచున్నది.

( నగలపెట్టెపట్టుకొని ప్రతిహారి ప్రవేశించును )

ప్రతి — భగవతీ! రాజుగారు పంపించిన యీదివ్యాంబరాభరణములతో మాలతిని దేవిమెదుటనే యలంకరించవలసిన దని పెద్దమంత్రి గారు సెలవిచ్చినారు.

కామం — పెండ్లికూఁతురిని వాటితో నలంకరించుటయే యుక్తము. ఏవి? చూపు.

ప్రతి — ఇవిగో తెల్లపట్టుచీరలు రెండు. ఇది రంగద్దినయుత్తరీయము. ఇవి సర్వాంగాభరణములు. ఇవి ముత్యాలహారములు. ఇది చందనము. ఇవి తెల్లనిపువ్వులదండలు.

కామం — ( అపవారించి ) వీటితో నలంకరించినమకరందుఁడు చూచు వారికి మాలతివలెనే చక్కఁగాఁ గనిపించును. ( ప్రకాశముగా= అవితీసుకొని) సరే! ఇచ్చి వచ్చితి నని యమాత్యునితో చెప్పు.

( ప్రతిహారి నిష్క్రమించును )

కామం — లవంగికా! మాలతిని తీసికొని నీవు లోపలికి వెళ్లు.

లవం — మఱి పూజ్యురాలో —

కామ — నేను కొంతసేపేకాంతమున నుండి యీయలంకారరత్నముల ప్రాశస్త్యమును శాస్త్రప్రకారము పరీక్షించెదను (నిష్క్ర మించును )

మాల — (తనలో) నాతో లవంగిక యొక్క తెయే యున్నదికానీ! ( ప్రకాశముగా ) ఇదే దేవీమందిరద్వారము సఖి! ప్రవేశిం పుము — ఇద్దఱు ( లోపలికి వెళ్లుదురు )

మక — వయస్యా! మన మీ స్తంభముచాటున నుండి చూతము
(అట్లు చేయుదురు)

లవం — సఖి! ఇదిగో చందనాదికము. ఇవిగో పుష్పమాలికలు.

మాల — అయితే, ఏమందువు?

లవం — వివాహముహూర్తమునకు ముందు కల్యాణసంపత్తినిమిత్తము దేవిని పూజించి రావలసిన దని అమ్మగారు పంపినారు గదా!

మాల — (తనలో) దురంత మైనదైవదుర్విలాసమున దుఃఖించుచు గుండె పగిలియున్న మందభాగ్యురాలిని నన్నేందుకే యింకా బాధించెదవు?

లవం — ఆచెప్పఁ దలఁచుకొన్న దేమిటో చెప్పు.

మాల — దృఢ మైననామనోరథము దుర్లభ మగునట్లు నాభాగ్యము తలక్రిందగుచుండ నే నే మాలోచింతును? ఏమి చెప్పుదును!

మక — వయస్యా! విన్నావా?

మాధ — విన్నాను. కాని, మనస్సునకు సంతుష్టి యెట్లు?

మాల — (లవంగికను కౌఁగిలించి) ప్రియసఖి! నిజముగా నాకు నీ వక్కవు. నీప్రాణసఖిని నేను. దిక్కులేనిదాననై చచ్చుటకు సిద్ధపడి యున్నాను. చిన్నతనమునుండి నమ్మిన చెలికత్తె వై ననిన్ను చేతులార కౌఁగిలించి యొక్కటి కోరుచున్నాను. నీవు నన్ను సరించి నడతువేని నన్ను మనస్సునఁ బెట్టుకొని దివ్యసౌందర్య లక్ష్మీనిలయ మైనమాధవునిముఖారవిందము నానందముతో నొక్కమాఱు చక్కఁగా చూడుము. (అనియేడ్చును.)

మాధ — వయస్యా మకరందా!

ఉ. ప్రాణసఖీనచో౽మృతమహత్త్వ మహా! యశు గంటినట్టి నా
ప్రాణము లేచి వచ్చినది, వాడఁగఁజొచ్చినయింద్రియంబులన్
ఘ్రాణ మొకింత చేరినది, దైవవశంబునఁ జావు దప్పెఁ, గ
ల్యాణము గల్గునన్నయభిలాషయు నేర్పడె మానసంబునన్

మాల — చెలీ? మఱొక్కమాట. నాప్రాణము రక్షించిన యాప్రాణ ప్రియుఁడు నామరణవార్త విని తనశరీరరత్నము నెడఁబాయ కుండు నట్లును, కథామాత్రశేషు రాల నైననన్ను స్మరించుచు లోకయాత్ర సాగించుచుండు నట్లును చెప్పవలసినమాటలు నేర్పుతో విన్నవించుము.

మక — అయ్యో! ఈమాటలు దుఃఖపుంజములు గదా?

మాధ — వయస్యా.

గీ. తనదుకోరిక నెఱవేఱ దనునిరాశ
గదుర భయపడుచున్నయీకాతరాక్షి
పలుకులం దోఁచువలపును వగపు నన్ను
ముదమునం దేల్చి శోకాబ్ధి ముంచు నొకట.

లవం — సఖి! నే నింక నీమాటలు వినలేను. నీకు శుభ మగుఁగాక.

మాల — చెలీ! మీకు మాలతీజీవితము ప్రియముగాని, మాలతి కాదుగదా!

లవం — ఏమి టామాట?

మాల — నాకోరిక ఫలించు నన్నమాటలనుబట్టి యెంతో యాశపెట్టు కొని యిన్నాళ్లు జీవించి, యిపుడు రోఁతమాట పడవలసివచ్చి నది. నామనోహరుఁ డైనమాధవునికి నేను పరకీయ నైతి నన్నభావము కలిగించెడియపరాధము నెత్తిని బడకుండ దేహము

పరిత్యజించి సుఖించుటయే నాయిప్పటికడపటికోరిక. ఈవిషయ మున నీవు నాకనుకూలురాలవు కాక తప్పదు. ( అని కాళ్లపైఁ బడును. )

మక — ఇది పరమస్నేహమునకు చరమావధి —

లవం — ( మాధవుని రమ్మని సైఁగ చేయును. )

మక — వయస్యా! వెళ్లు. లవంగికాస్థాన మాక్రమించు.

మాధ — నామేను పరవశ మగుచున్నది.

మక — అభ్యుదయములస్వభావ మది. అవి సిద్ధించునపు డట్లే యుండును.

మాధ — ( సరిగా లవంగిక నిలచినచోటనే నిలుచును)

మాల — దయచేసి నామనోరథము తీర్ప ననుగ్రహింపుము.

మాధ — గీ. సకియ! సాహసకృత్యంబు సలుపరాదు
తోఁటుపడఁ గూడ దిట్టు లోతోయజాక్షి!
విరసమై విస్తరించునీవిరహబాధ
నోర్వఁజాలదు నాచిత్త ముజ్జ్వలాంగి!

మాల — నమస్కరించిచెప్పుచున్ననామాట నీవు దాఁటరాదు.

మాధ — గీ. విరహదుఃఖాపనోదనావేశవేని
కామ మొనరించుకొమ్ము నీకాంక్షితమ్ము.
నేను జెప్పెడి దేమింక నిర్మలాంగి!
లేచి నన్నొకపరి కౌఁగిలించుకొమ్ము.

మాల — ( సంతోషముతో లేచి ) అనుగ్రహించితివా! చాలు. ఇదిగో కౌఁగిలించుచున్నానుసఖీ! కన్నుల నీరు గ్రమ్మియుండుటచే నీదర్శ

నను నా కక్షిగోచరము గాకున్నది. (కౌఁగిలించి సానందముగా) చెలీ! ముదిరినసెంజలతోడిపద్మకోశమువలె గట్టిగా నుండి గగుర్పొడిచిననీమేనితాఁకుడు వేఱువిధముగా నున్నదిగాని, నాకు సుఖము కలిగించినది సుమీ! సఖి! ఇంకొకమాట. నాప్రాణప్రియుని సందర్శించినపుడు రెండుచేతులు శిరమునఁ జేర్చి నమస్కరించి యీమాటలు నామాటలుగావిన్నవింపుము — "ప్రాణప్రియా! భాగ్యహీనురాల నైననేను, వికసితశతపత్రలక్ష్మిని వికలము గావించునీముఖచంద్రమండలమును నేత్రపర్వముగా స్వేచ్ఛగాఁ జిరకాలము సందర్శించి యానందింప నోఁచుకొనలేదు. నిరంతరదుస్సహవిరహదుఃఖావేగముచే నూగాడుచున్న హృదయము నెట్లో యింతవఱకు రిత్తకోరికలతో నిలుపుకొని వచ్చినాను. నాటినాటికి సఖీజనములకు సంతాపము గలిగించు నాశరీరసంతాపము లెన్నో! లెక్క లేదు. చంద్రాతపమలయానిలాదిక మైనయనర్థపరంపర నెట్లు గడచినానో చెప్పఁ జాలను. ఇప్పటికి నాయాశ నిరాశ యైనట్లు స్పష్ట మైనది." సరిగా విన్నావా? సఖి! నన్ను మఱచిపోకు. ఇది నాప్రాణనాథుఁడు మాధవుఁడు స్వయముగా గ్రుచ్చినవకుళమాల దీనిని నన్నుఁ గాఁజూచుకొనుచు సర్వదా మెడలో ధరించుము — (అని తనమెడలోనిపొగడదండ తీసి మాధవునిమెడలో వేసి ఱొమ్మ మీఁద సవరించుచు. తటాలున వెనుకకు తగ్గి భయకంపములు నటించును.)

మాధ — (అపవారించి) అహహా! ధన్యుఁడను.

ఉ. సారసనేత్ర యిప్పుగిదిఁ జక్కఁగ నన్నుఁ గవుగిలించి, నీ
హారమృణాళచందనహిమాంశుకలాఘనసారహారముల్

చేరిచి నూఱి తద్రసము చేతుల మేన నలందినట్లు నా
ఘోరవియోగతాప మొకకొంత శమింపఁగఁజేసె నిత్తఱిన్.

మాల — అహో! లవంగిక నన్ను మోసగించినది.

మాధ — ప్రేయసీ! నీమనోవేదనమాత్రమే నీవు తెలిపితివి గాని, ఎదుటివారిమనోవ్యథ యెఱుఁగకున్నావు. మన కిద్దఱికి నించుక సంతాపశాంతి గలిగించినలవంగిక నిట్లు నిందించుట తగునా?

చ. మనసిజవేదనాజ్వరము మంటలు గ్రక్కుచునుండ మేన, ని
న్మనసునఁ గౌఁగిలించుకొనుమాత్రన తాపము తగ్గుచుండ, న
న్మనసున నిల్పు నీవలపు మున్నన ప్రాణము నిల్పుచుండ, గెం
టినదివసంబు లెన్నని గణించెదను? నీవ గణింపుమా మదిన్!

లవం — చెలీ! నన్ను నిందించినందుకు చక్కఁగా బదులు తీఱినదా?

కల — ఆహా! ఈసమావేశ మెంతమనోహరముగా నున్నది?

మక — మహాభాగ్యశాలినీ మహామాత్యపుత్త్రీ! నామిత్త్రుఁడు చెప్పిన దంతా నిజము నిజము.

చ. వలచినదాన వంచుఁ దనవాంఛ నెఱుంగుసుశీల వంచు నీ
కలయికఁ గోరి యుండనుకఁ గామశరాహతి కోర్చి నిల్చె నీ
చెలువుఁడు సత్యు, మింక దయచేసి యొసంగుము వేగ కంకణో,
జ్జ్వల మగుపాణి నీతనికి సౌఖ్యము గాంచుఁడు కోర్కు లారఁగన్.

లవం — (మాధవుని జూచి) మహానుభావా! మీరు స్వయముగా హృదయము పరిగ్రహించినపుడే యంగీకరింప సాహసించిన యీమనోహారిణి యిపుడు చేయిపట్టుకొనుచో సంకోచించునా?

మాల — అయ్యో అయ్యో!! కులకన్యలకు తగనియాచార ముపదేశించుచున్నది.

కామం — (ప్రవేశించి) కుమారీ! భయపడుచున్నావేమి?

మాల — (వణఁకుచు కామందకిని కౌఁగిలించును)

కామం — (మాలతిగడ్డ మెత్తి) బిడ్డా! ఎందు కీవణఁకు?

చ. వినుము కుమారి! మీరిటకు మెచ్చు నొండొరుఁ జూచుకోరె? మీ
మనములపారవశ్యములు మైమఱపుల్ విదితంబుగావె? కూ
ర్మిని మన సిచ్చి పుచ్చుకొనరే? యిఁక జంకును గొంకు నేల? నీ
కు నతని నిన్ను నాతనికిఁ గూర్చిన బ్రహ్మతలంపు తప్పునే?

అమ్మా! నామాట గౌరవించి, ఆచతురాస్యునిచాతుర్యమును, ఆపంచబాణుని ప్రావీణ్యమును సఫలంబుగా గాంధర్వమున మాధవుం బరిణయమ్ము కమ్మా.

లవం — భగవతీ! మాలతికైనాను నేమీ సందేహము లేదు. మొన్నటి కృష్ణచతుర్దశినాఁటిరాత్రి శ్మశానమున మహామాంసము విక్రయింపఁబూనిన యీమహానుభావుఁడు మహాసాహసికుఁ డనియు, పాషండచండాలుఁడైన యఘోరఘంటునివోడ్చి సాహస మొనఁగించిన ధైర్యమూర్తియనియు నెఱుఁగును గావున నది తలఁచుకొని యించుక వణఁకుచున్నది. అంతే.

కామం — లవంగికా! మాధవునియనురాగమును, సాహసముతో నితఁడు చేసినయుపకారమును చక్కఁగా ప్రకటించినావే!

మాల — హా! జననీజనకులారా! మీ రేమనుకొందురో!

కామం — వత్సా మాధవా!

మాధ — ఏమి సెలవు?

కామం — సకలసామంతరాజులు పాదాక్రాంతులుగా పద్మావతీరాజ్య పాలనము నిర్వహించు మనమాత్యభూరివసువు నేకైకపుత్రిక యీ

మాలతి. అనుకూలదాంపత్యనిర్మాణనిపుణుఁ డైన బ్రహ్మయు సమానసద్గుణవధూవరసంఘటనచతురుఁడగు మన్మథుఁడును సము చితమాగు వయత్నవిధాయిని నగు నేనును, ఈకన్యను నీకర్పించు చున్నాము. ( కన్నీరు విడుచును )

మక — పూజ్యురాలియనుగ్రహము సఫలమైనది.

మాధ — పూజ్యురాలుకూడా కంటనీరు పెట్టుచున్నది. ఆహా వాత్సల్యము !

కామం — ( కొంగుతో కన్నులు తుడుచుకొని ) వత్సా ! శుభప్రద మైనమాట యొకటి చెప్పఁదలఁచినాను.

మాధ — భగవతీ ! సెలవిమ్ము

కామం — విన్నవించెద.

మాధ — భగవతీ ! విధేయుఁడను, ఆజ్ఞాపించుము.

కామం — నాయనా మాధవా !

ఉ. పావన మైనప్రేమ పరిపాకమనోజ్ఞమునా నెఱుంగున
ద్భావుఁడ వీవు, కన్నె నిడుదానను నేనును నీకు మాన్య, నో
యీ విను మొక్కమాట ! మన నిచ్చ సయిూకులకన్య నెన్నఁడే
మీ విరసోక్తులాడకుసుమీ ! కరుణామతిఁ జూచుచుండుమీ !

( అనుచుఁ గాళ్ళమీఁదఁ బడఁజూచును )

మాధ — అహో ! వాత్సల్యపారవశ్యమున భగవతిచేయు ప్రస్తావ మౌచిత్యము నతిక్రమించుచున్నది గదా !

మక — తల్లీ ! ఏమిది ?

చ. కనుఁగవవిందు సోయగము, గౌరవపాత్రము సచ్చరిత్ర, మ
త్యనుగుణమాభిజాత్యము, హ్లాదంతరపూర్ణము ప్రేమసార, మం

చనయమునీ మెసద్గుణములాత్మఁ దలంచునితండు మీాహితో
క్తినిశిరసావహింపఁడె ? నతింబొనరింతురె పిన్నవానికిన్ ?

కామం — వత్సా మాధవా !

మాధ — ఆనతిమ్ము భగవతీ

కామం — ఈకన్యను స్వీకరించుము.

మాధ — స్వీకరించుచున్నాను. ( మాలతిచెంత నిలచును)

కామం — కుమారా మాధవా ! బిడ్డా మాలతీ !

ఇద్దఱు — భగవతీ ! సెలవిమ్ము

కామం — గీ. కలిమి చుట్టంబు పక్కంబు చెలిమి చెలియు
వాంఛ లానందము యశంబు ప్రాణ మనఁగ
భార్యకును భర్త భర్తకు భార్య యనెడి
ధర్మసూత్మ్రంబు మీా రెదం దలపుఁ డెపుడు.

మక — అవశ్యము మీా రుపదేశించినట్లే చేయుదురు

లవం — భగవతి యాజ్ఞాపించినట్లే నడుతురు.

కామం — వత్స మకరందా ! మాలతి కని తెచ్చిన యీావైవాహికనే పథ్యమును నీవు ధరించి నీపెండ్లికి నీవు సిద్ధపడుము. ( అని నగలపెట్టె నిచ్చును )

మక — మీా సెలవు. ఈ తెరచాటున కేగి వేషము వేసికొందును. ( అట్లు చేయును )

మాధ — భగవతీ ! వేషధారణము సులభమే కాని, కార్యనిర్వాహణ మతికష్టము.

కామం — నీ కెందు కీచింత ?

మాధ — అయితే సరే. మీా చిత్తము.

మక — (ప్రవేశించి నవ్వును)

(అందఱు విస్మయపడి సంతోషముతో చూతురు)

మాధ — (మాలతీరూపమకరందుని కౌఁగిలించుకొని) భగవతీ నందనుఁడు పుణ్యము చేసికొన్నాఁడు. ఈవేషముతో నున్న నామిత్రుని జూచి యొకనిమిష మైనా సంతోషించునుగదా!

కామం — బిడ్డా మాలతీ! కుమారా మాధవా! మీా రిక్కడినుండి బయలుదేఱి యీా యడవిదాఁటి వెళ్ళి యెదుటఁ గనవచ్చు దిగుడుబావివెనుక నున్న యుద్యానవాటికఁ జేరుఁడు. అక్కడ వివాహసంభారము సమకూర్చుచున్న అవలోకిత కనవచ్చును. మీా కచ్చటనే పెండ్లి జరుగును. ఆప్రదేశ మతిమనోహరము.

ఉ. అంగజుఁ డేఁచు కేరళలతాంగులచెక్కులఁ బోలుపర్ణ రా
జిం గనునాగవల్లరులఁ జెన్నయి పండ్లగెలల్ చలింపఁగా
వంగినపోకలున్, బదరభక్షణముగ్ధశుకీరుతంబు, గా
లిం గదలాడువల్లరులలీలలు మీాకుఁ బ్రియం బొసంగెడున్.

అచ్చటికి మదయంతికామకరందులు వచ్చునందాఁక మీా రందే విహరించుచు నానందింపుఁడు.

మాధ — (సంతోషముతో) మాకల్యాణలక్ష్మి కిటుపైని మఱియొక కల్యాణ మలంకార మగుఁగాక.

కల — దైవ మనుకూలించినచో మా కది కూడా లభించును.

కామం — సందేహ మెందుకురా!

లవం — ప్రియసఖీ! విన్నావా?

కామం — కుమారమకరందా! శిల్లా లవంగికా! మన మీదారిని పోవుదము.

మాల — చెలీ! నీవు కూడా వెళ్ళవలెనా?

లవం — (నవ్వి) ఇప్పుడు గదా మేము వేత్రైౖ వెళ్ళుచున్నాము!
(అనుచు, కామందకీ లవంగికా మకరందులు నిష్క్రమింతురు)

మాధ — ఇదిగో నే నిపుడు —

చ. కరి సరసీగతం బగుసకంటకనాళము రక్తపంకజం
బురవడిఁ బట్టుకై వడి సముత్పులకాంచిత బాహువున్ మనో
హరమృదులాంగుళీదళము నైననఖకర మేను బట్టెదన్
గరమున శాంతి నొందఁగ ననంగనిదాఘకృతార్తితాపముల్.

(అని యందఱు నిష్క్రమింతురు)

ఇతి మాలత్యుపహార మను షష్ఠాఙ్కము

# మాలతీ మాధవము

## సప్తమాఙ్కము

( తరువాత బుద్ధరక్షిత ప్రవేశించును )

బుద్ధ - ఆహా! భగవతి యగుకామందకిప్రజ్ఞాచాతుర్యమున మకరందునిమాలతీవేష మెంతోచక్కఁగా సరిపోయినది. భూరివసువుగారియింట నెట్టియవరోధము లేకుండ కృతకమాలతీనందనుల వివాహ మతివైభవముగా జరిగినది. మే మందఱము నందనుని యింటికి వచ్చినాము. భగవతి నందనునితో చెప్పి తనయింటి కేగినది — నూతనవధూగృహప్రవేశమునిమిత్తముగా నిచ్చట జరిగినయకాలకౌముదీమహోత్సవమున నలసినపరిజన మంతయు ప్రమత్తమై యున్నది — చీకటి పడుచున్నది. మాకర్తవ్యము నెఱవేర్చుకొనఁ సమయము తటస్థించినది — కామాతిరేకమున తొందరపడుచు తమక మాపుకొనలేక కాళ్లమీఁదపడి యల్లుఁడు గారెంతబ్రతిమాలినా, అంగీకరింపక, ఛీ పొమ్మని మాలతి నిరాకరించినది. పాపము నందనుఁడు కోపము నవమానము భరింపలేక మాట తడఁబడుచుండ కన్నుల నీరు కాఱుచుండ మొగము కందగడ్డ కాఁగా “ఛీ! ఇఁక నాకా బంధకితో పని లే దని పడకటింటినుండి వెడలిపోయెను. కావున మాలతి ననునయించు నెపమున మదయంతికను దీసుకొని వచ్చి మకరందునితో కలిపెదను.

( అని నిష్క్రమించును. )

ఇది ప్రవేశకము

(తరువాత శయ్యాగారమున నైనమాలతీవేషముతో డిగు మకరందుడును. లవంగికయు ప్రవేశింతురు)

మక — లవంగికా! బుద్ధరక్షిత కార్యరంగమున ప్రవేశించినది కావున భగవతి కార్యనీతి ఫలించు ననుకొందును.

లవం — మహాభాగా! ఇంకా సందేహ మేమి? అదిగో! అందెల చప్పుడు వినబడుచున్నది. మాలతీసాంత్వనము పేరుపెట్టి మదయంతికను తీసుకొనివచ్చుచున్నది — ఉత్తరీయము కప్పుకొని నిద్ర పోవుచున్నట్లుండుము.

(మకరందు డట్లు చేయును)

(అంతట, మదయంతికయు బుద్ధరక్షితయు ప్రవేశింతురు)

మద — సఖీ బుద్ధరక్షితా! నిజముగా మాలతి మహాయన్నకు కోపము తెప్పించినదా?

బుద్ధ — సత్య మమ్మా!

మద — ఔరా! ఎంత తప్పు? ఈమె కింత పెంకెతన మెందుకో? అదలింతము. రా! రా!

(పరిక్రమింతురు)

బుద్ధ — ఇదే శయ్యాగారము.

(ఇద్దఱు ప్రవేశింతురు)

మద — లవంగికా! నీప్రియసఖి నిద్రించుచున్నది కాంబోలు!

లవం — ఔను. లేపకు. చాలాసే పేదో విచారముతో కలత పడ్డది. ఇపుడే కొంచెము కునుకు పట్టినది. కదపకు. మెల్లగా పక్కలో కూర్చుండుము.

మద — (అట్లు చేసి) మగని కెదురాడి యీవిడ పైగా వగచినదా?

లవం — అవునమ్మా! నీయన్న మంచియందగాఁడు మంచిమాట నేర్పరి. క్రొత్తపెండ్లికూఁతురికి కుతూహలము పుట్టించునుపాయములు తెలిసినవాఁడు. అట్టివాఁడు భర్తయై నందుకు మాచెలి యెందుకు విచారించదు?

మద — బుద్ధరక్షితా! చూడు చూడు. మా కీయెదురునింద యేమిటే? విపరీతము!

బుద్ధ — ఇది విపరీతముగా కనఁబడుచున్నది గాని, విపరీతము కాదు.

మద — అ దెట్లు?

బుద్ధ — పాదాలమీఁద పడినభర్త నీమె లేవఁదీసి గౌరవించ లేదు. నిజమే — అది లజ్జాదోషము కదా? అందు కీమెను నిందింప వచ్చునా? పోనీ గాని, ప్రియసఖీ! క్రొత్తగర్భాధానపుపెళ్లి కూఁతురి నెవరయినా మెల్లగా బుజ్జగించి వశపఱచుకొందురు గాని, ముందుగానే తొందరపాటు చూపి, యంతలోనే యెదు రాడిన దనుకొని రుసరుసలాడుచు నోరాడించుచు గది విడిచి పోదురా? అది, మహానుభావుఁ డైన నీయన్నకే చెల్లినది. కావున, ఈవిషయమున మనమే నింద కర్హులము. ఇట్టియెడల కామసూత్రకర్తల యభిప్రాయము నిదే.

లవం — కులకన్యలను పెండ్లాడినపురుషు లింటింట నున్నారు గాని, లజ్జాభూషణయు నిరపరాధయు ముగ్ధస్వభావయు నైనకులకుమారి యొల్లు మండునట్లు, నేను గొప్పవాఁడ నని నిప్పులు కురియు పురుషవాక్యములు పలికిననీయన్న వంటిమగవాఁ డెందును కనబడఁడు. పత్నీగృహ మంటే భీతిని విరక్తిని పుట్టించునిట్టియవమానకర మైనదూషణవచనములు కులకన్యల కామరణము దుస్సహములు దుర్భరములు నైనహృదయశల్యము లనుట

కాక్షేపమేమి? ఇందుచేతనే కదా కూఁతురు పుట్టిన దంటే గృహస్థులు క్రుంగి పోవుచుందురు?

మద — బుద్ధరక్షితా! ప్రియసఖి మైన లవంగిక చిక్కాలి నొచ్చుకొన్నది. మాయన్న యేదో చెడ్డమాట లని యుండును.

బుద్ధ — రుసరుస లాడుచు గది విడిచిపోవుచు "ఛీ! ఇఁక నా కీబంధ కితో పని లే" దని స్పష్టముగా నన్నాఁడు, మే మందఱము విన్నాము.

మద — (చెవులు మూసుకొని) అయ్యో తొందర! ఎంత పొరపాటు? లవంగికా! నీముఖము చూడలేకున్నాను. అయినా, ముఖ్య స్నేహితురాలవుగదా యని నీ కొకటి తెలుపుచున్నాను.

లవం — కానీ! నీదాననే.

మద — నాయన్న తొందరపాటును, అతఁడు పలికినమాటయు నటుం డనీ! "అతఁడు చేసినది తప్పయినా, నీవు భర్త కనుకూలముగా ప్రవర్తింపవలె" నని మీరు మాలతికి బోధించలేదు. పామర జాతికి యోగ్య మైన యట్టినిందావాక్యమునకు మూల మేమో మీరా రెఱుగరు.

లవం — అట్టిమూల మంటే మా కెందుకు తెలియదు?

మద — మాలతి, ఆమహానుభావుఁ డైన మాధవుని ప్రేమించి యున్న దని యొకమాట పుట్టి, య దే యిప్పుడు లోకమంతట మహాప్రవా దమై వ్యాపించినది. కావున, సఖీ! మాయన్న యనుమాన మును మాలతియుదాసీనతయు నంతరించెడియుపాయము వెం టనే యాలోచించుము. లేకున్న, ప్రమాదము సంభవించు నని, నమ్ము. కులకన్యలకు సంబంధించినయిట్టిజనప్రవాదము హృదయ

దాహాక మని తెలిసికొనుము. ఈప్రవాదమునుమాట నేను చెప్పిన ట్లెక్కడా నీవు చెప్పవద్దు.

లవం — చెలీ! చాలులే. అసంబద్ధ మైనలోకప్రవాదమును నమ్మి యిట్లనెదవా? ఊరుకో! ఇంక నీతో మాటాడను.

మద — సఖీ! శాంతించు. మీ రీమాట వినియుండక పోవచ్చును గాని, మాలతి మాధవునిమీఁద ప్రాణము పెట్టుకొని యున్న దని మే మెఱుఁగుదుము. మాలతి మనోవేదనపాలై లేఁత గేదఁగిరేకులవలె నవయవములు తెల్లఁబడిపోఁ, మాధవుఁడు గ్రుచ్చినపొగడపూవులదండ ధరించి యెట్లో ప్రాణము నిలుపుకొనుచున్న దని యెవరికి తెలియదు? మాధవుఁ డీమెపై ప్రాణము పెట్టుకొని విరహవేదనచే ప్రభాతచంద్రునివలె తెల్లవడి చిక్కిపోయి యున్నాఁడని యెవ రెఱుఁగరు? ఇం తెందుకు? ఆనాఁడు కుసుమోద్యానముచెంత వీథిమొగలో మీ రిరువురు నొకరి నొకరు సాభిప్రాయముగా నతికుతూహలముతో కన్నులు విరియ, కనుబొమలు నటింప, కాంక్షలు మీఆ ననంగుఁడు నేర్పిన శృంగారవిలోకనవిలాసములు వెల్లివిరియునట్లు చూచుకొన్న చూపులు నే నెఱుఁగనా? ఆవేళనే మాయన్నకు మాలతి నిచ్చి రన్నవార్త విన్నంతనే మీ రిద్దఱు గుండె జారిపోయినట్లు నిశ్చేష్టులై వెలవెలఁబోవుముఖములతో కళ్ళు చీఁకట్లు క్రమ్మినట్లు కాలుసేతులు పట్టు దప్పినట్లు కలఁతచెందినవిషయము నేను కనుఁగొనలేదా? — మఱే! ఇం కొకటి, మఱచిపోయినాను.

లవం — ఏమి టమ్మా! అది కూడా చెప్పు.

మద — ఆనాఁడు నన్ను రక్షించిన మహానుభావునికి స్మృతి వచ్చిన వార్త మాలతి మాధవునికి దెలిపి యతనికి తెలివి తెప్పించి

యుపచరించినది. అప్పుడు తగినపారితోషిక మిమ్మని భగవతి చెప్పఁగా, తనజీవితమును హృదయమును మాలతి స్వీకరింప వచ్చు నని మాధవుఁ డన్నాఁడు. లవఙ్గికా! అప్పుడు, ఇది మహాప్రసాదము మాలతికి తగినబహుమానమని నీ వన్నావు కాదా?

లవం — నిన్ను రక్షించినయామహానుభావుఁ డెవ రమ్మా!

మద — జ్ఞప్తికి తెచ్చుకో! సముచితావయవసన్నివేశుఁడు పీనవక్షుఁడు పీవరభుజాస్తంభుఁడునైన యేమహానుభావుఁడు పెద్దపులినోటఁ బడకుండ నన్ను రక్షింప దారి కడ్డము వచ్చి దానిని సంహరించెనో, దానిగోళ్ళు గ్రుచ్చుకొన్న యెవనిఱొమ్మున రక్తధారలు శిథిలమైనజపాకుసుమ హారములవలె శోభిల్లెనో! ఆయన —

లవం — ఆహాఁ! మకరందుఁడా?

మద — (సానందముగా) ఎవ రన్నావు?

లవం — మకరందుఁ డన్నాను. (సస్మితముగా మదయంతికపై చేయి వేసి — చేతితో చూపుచు)

గీ. మాచెలిని గూర్చి నీ వన్నమాట లిపుడు
కా దనను గాని, మకరందుకథలు చెప్పు
చున్నయీకులకన్యక యొడలిదేల
మొగ్గ దొడఁగినకడిమిసొంపును వహించె?

మద — (సిగ్గుతో) సఖీ! వేళాకోళముచేయుచున్నావా? అయితే విను. తన బ్రతు కేమగునో యన్నయాలోచన లేక నన్ను బ్రతికించిన యామహాసాహసికుఁడు మహోపకర్త దయాళువు మక

రందుఁడు — అట్టిమహానుభావుని స్మరించినపుడు హృదయము స్ఫోటింపదా? పులిగోళ్లు గట్టిగా గ్రుచ్చుకొనుటచే బాధపడుచు మేనెల్ల చెమర్చ కన్నులు మూఁతపడ వణఁకిపోయిన యాపురుషుని నీవు చూచినావు గదా! నాకోసముకదా! ఆమహాత్ముఁ డంత కష్టపడెను? అబ్బా! ( స్వేదాదివికారము లభినయించును )

బుద్ధ — ( ఆమె దేహము తాఁకి ) ఔరా! ఒళ్లెంత వేఁడిగా నున్నదో! చెలీ! నీవు నోటితో చెప్ప నక్కఱలేదు. మకరందునిపొందు కోరుచున్నా వని నీదేహమే తెలుపుచున్నది.

మద — ( సిగ్గుతో ) పోవే! ఏమి టీమాటలు? నాసహవాసిని యగు మాలతిచర్యలు తలఁచుకొనుటచే నోళ్లు వేఁ డెక్కినది. అంతే-

లవం — సఖీ! నిజ మేమిటో మాకు తెలియకపోలేదు. మాదగ్గఱ దాఁపఱిక మెందుకు? సంశయింపక మమ్ము నమ్మి నీమనసులోనికోరిక నెమ్మదిగా చెప్పు. దానికి తగినయుపాయము మే మాలోచింతుము.

బుద్ధ — సఖీ! లవంగిక చెప్పినమాట బాగున్నది.

మద — సరే! ఇంక మీయిష్టము —

లవం — అయితే, నీవిపుడు కాల మెట్లు గడపుచున్నావో ముందు చెప్పు.

మద — సఖీ! విను. బుద్ధరక్షిత నిష్పక్షపాతురాలు, నన్ను ప్రేమించినది, అందుచే దీనిమాటలనుబట్టి ముం దాసుందరునిమీఁద నాహృదయ మనురక్త మైనది. తరువాత దైవికముగా నతని దర్శనము స్పర్శనము లభించినవి. మే మన్యోన్య మనురక్తితో చూచుకొన్నాము మాహృదయములు కలసినవి. అది మొదల

లుగా ప్రసన్నందర్శనమే లభింపలేదు. దానంజేసి విరహానల సంతప్త నగుచు నే నెట్లు కాలము గడపుచున్నానో నాపరిజన మెఱుంగును. ఈవియోగదుఃఖానుభవముకంటె మరణమే మే లనిపించినది గాని యీచెలి చెప్పుచున్నమాటలనుబట్టి ప్రాణము లెట్లో నిలుపుకొనియున్నాను. తలంపులలోను స్వప్నములోను నామనోహరుని కాంచుచు మాటాడుచు నానందించుట, తెలివి వచ్చినపిదప దుఃఖించుట, ఇదే నాదినచర్య. చెలీ! వేయేల? ఈజీవలోకము నాకు నిజముగా జీర్ణారణ్యమే.

లవం — సఖీ! మీస్వప్నసమాగమమందలి విశేషము లేమీ చెప్పి నావు కావు.

మద — ఓసిపోవే! హృదయముడికి పోవుచుండ —

బుద్ధ — ఇది మాలతికి ముఖ్యస్నేహితురాలు గనుక నిట్టి వడుగం జాలినది.

మద — మాలతి నిట్లు పరిహాసింపంగూడదు.

బుద్ధ — సఖీ మదయంతికా! నామీంద నమ్మకము పోదంటే, ని న్నొ క్కటి యడిగెదను.

మద — చెలీ! ఇట్లనెదవేల? మనమైత్రికి భంగముగా నే నట్టితప్పు చేయుదునా? లవంగికయు నీవు నిపుడు నాహృదయ మనుకో.

బుద్ధ — నీకు మకరందుండు మరల నిపుడు కంటంబడితే నీ వేమి చేయుదువు?

మద — ఆసలు దీఱ నతని నాపాదమస్తకము చూచి నాకన్నులకు విం దొనరింతును.

బుద్ధ — సరే. అతండు కామపరవశుండై మదనవికారము పుట్టించు నిన్ను, పురుషోత్తముండు రుక్మిణీదేవి నట్లు స్వయముగా సాహ

సించి పరిగ్రహించి సహధర్మచారిణిని గావించుకొన్నచో సఖునకు నీ వేమి చేయుదువు ?

మద — (నిశ్శ్వసించి) ఎందు కీయూఱడింపుమాటలు ?

బుద్ధ — అనుమాన మెందుకు ? నిజము చెప్పు.

లవం — సఖీ! వచనములోనితొట్రుపాటును సూచించునీనిట్టూర్పులే చెప్పుచున్నవిలే!

మద — తనప్రాణము పందెమొడ్డి మృత్యుముఖమునుండి బయటికి లాగినయాధీరునిసొమ్మైనయీశరీరము నెడ నాకేమి హక్కున్నది ? ఇది యతనిసేవచేయుదేహమే.

లవం — సఖీ ! నీయుదారబుద్ధికి తగినమాటచెప్పినావు. బళీ !

బుద్ధ — ఇపు డన్నమాట మఱచిపోకు సుమీ !

మద — ( ఘంటానాదశ్రవణ మభినయించి ) అపుడే రెండోజాముకూడా గతించినది. భయపెట్టియో, బ్రతిమాలియో, కాళ్లు పట్టుకొనియో, ఎట్లో నందనుని తీసికొనివచ్చి మాలతితోఁ గలిపెదను ( అని లేవఁబోవును )

( మకరందుఁడు ముఖముమీఁది యుత్తరీయ మెత్తిగించుకొని, మదయంతిక చేయి పట్టుకొనును )

మద — సఖీ మాలతీ ! మేలుకొన్నావా ? ( ముఖము చూచి, సంతోషముతో భయముతో ) ఆహా ! చూడఁగా, ఇదంతా వేఱుగాఁ గనఁబడుచున్నది.

మక — ఏమిది ? ఎవ రనుకొన్నావు ?

చ. జలజదళాక్షి ! యీభయము సంభ్రమ మెందుకు ? నన్ను వేఱుగాఁ దలఁపకు, నీతలంపుల సదా నివసించుచు నున్నవాఁడ, నీ

కలఁ గనిపించునట్టి చెలికాఁడ భవత్కృప గోరుదాసుఁడన్
దొలఁకెడు నీయువస్తుటికిఁ దోడుగఁ గా నపివాండుఁ జూచితే?

బుద్ధ — (మదయంతిక ముఖమెత్తి)

ఉ. నీమది నిల్పినట్టి మహనీయుఁడు కోర్కులపంట నిర్మల
ప్రేమ మితఁడు నేఁటికి లభించెఁ గృతజ్ఞత చూపు, మీగృహాం
బేమతె నిద్రమత్తి గొని, హెచ్చెను జీకటి, రత్ననూపురా
లేమియు క్రొంగకుండఁ బయికెత్తుము పాదము భద్రమయ్యెడున్.

మద — అయితే సఖీ! మన మిప్పు డెక్కడికి పోవలెను?

బుద్ధ — మాలతి యున్న చోటికి —

మద — మాలతీ సాహసించినదా? —

బుద్ధ — ఔను.— "రక్షించి సొమ్మయినయీశరీరము నెడ నా కేమి హ
క్కున్నది" అని నీ విప్పుడే పలికియున్నావు. అది స్మరింపుము.
మాలతియు నట్లే యనుకొన్నది.

మద — (కన్నీరు విడుచును)

బుద్ధ — మహాభాగా! ఆనందబాష్పము లొలుక నాసఖి స్వయముగా
తనశరీరమును నీ కర్పించినది.

మద — అహో మహాభాగ్యము!

చ. ఇది సుదినంబు, నా కిపుడు హెచ్చె బలంబు, కలఁక దేఱె నా
హృదయము, నాదుయౌవనము నీశుభమున్ విని పొంగుచుండె, మే
ల్మదనుఁడు తన్ని తండ్రి యయి మాలతిమాధవుఁ గూర్చి యం, దిదే
యద నని కూర్చె నన్ను మదయంతిక నిందు ననుగ్రహంబునన్.

సరే లెండు. ఈప్రక్కదారి నేగుదము.

(వరుసగాఁ బరిక్రమింతురు)

మక — సెబాసు! రాజమార్గ మెంతయు నిర్జనసమ్మర్దము నిశ్శబ్దమునై యనుకూలముగా నున్నది. (స్పర్శసుఖ మభినయించి) మార్గమునకుఁ దోడ్పడు చల్లగాలియు గూడ మఱింత యనుకూలముగా నున్నది. ఆహా!

గీ. సౌధముల హర్మ్యములఁ జంద్రశాలలందు
చందనాగురు కర్పూరకుందమాల్య
గంధముం గొని యేతెంచు గంధవాహుఁడు
యువతియువకులపొందిక లుగ్గడించు.

(అని యందఱు నిష్క్రమింతురు)

ఇది నందనవిప్రలంభమను సప్తమాఙ్కము.

---

# మాలతీమాధవము

## అష్టమాఙ్కము

(పిదప, అవలోకిత ప్రవేశించును)

అవ — నందనునియింటినుండి మరలి వచ్చినభగవతిని దర్శించి నమస్కరించి యిపుడు మాలతీమాధవులచెంతకుఁ బోవుచున్నాను. (పరిక్రమించి) అదిగో! వారిద్దఱు గ్రీష్మకాల మగుటచే దిగుడుబావిలో సాయంకాల స్నానమాచరించి గట్టుమీఁది రాతిపలకపై సుఖముగాఁ గూర్చుండియున్నారు. వారిని సమీపించెద. (నిష్క్రమించును)

ఇది ప్రవేశకము

(అంత, ఉపవసించియున్న మాలతీమాధవులును, అవలోకితయుఁ ప్రవేశించుచున్నారు)

మాధ — (సానందముగా) చిత్తజన్మునిప్రౌఢమిత్ర మగు నిశీథము యౌవనశ్రీ నలరారుచున్నది. అదిగో!

గీ. గాలిఁ గదలినగేదంగిపూలరజము
చదల నెఱయుచు నున్నట్లు చంద్రకాంతి
తూర్పుదెసనుండి యల్లనఁ దోఁచి తోఁచి
తిమిరము నణంచుచుండెను దిశలు వెలయ.

(తనలో) కులకన్యక గావున క్రొత్త యగుటచే మాలతి మిక్కిలి సిగ్గు చూపుచున్నది. దీనిని చనవుచేసికొనుట యెట్లో? కానీ! యిట్లని చూచెద. (ప్రకా) ప్రేయసీ మాలతీ! ఇటు చూడు. ఒక్కమాట ఇంకా నన్ను వేఱుగాఁ జూచుచున్నావా? ఇదిగో —

చ. అలికులలీల నేలుకురు లాఱకమున్న, యనంగలాగినో
జ్జ్వలిత మురస్తటంబు చలువం దిగనాడకమున్న, పేసికిం
పలరుచు నున్న సాంద్రపులకాంకురజాలము పోకమున్న, శీ
తలపరిరంభణంబున ముదం బొనగూర్ప నుపేక్షింపవా?

(కొంచెము మాఁగి) నీ వింతనిర్దయురాలవా? — పోనీ! ఇది విను —

సీ. సంశయము దీలి లజ్జ హెచ్చఁగఁ జెమర్చి,
యిందుకరములఁ గరఁగినయిందుమణుల
సరముపలెఁ జల్లనగునీభుజంబు నాదు
జీవనంబుగ నామెడఁ జేర్చు చాలు

ఏమందువు ప్రాణసఖీ! పోనీ! ఈ కోర్కె కూడా దూరముగా నుండనీ! ఆనందదాయక మైననీయాలాపమున కైన నేను నోఁచుకో లేదా?

చ. యమునకడనుండి వచ్చుమలయానిలునుద్ధతి, బాడబాగ్ని స
ఖ్యము వొనరించుచంద్రుకరఘట్టన నొచ్చిననాదు మేనితా
పము శమియింపఁ గౌఁగిటను బట్టవుగాక, పికాళికూజలన్
శ్రమపడువీనులం దనుప రాదొకొ నీమధురోక్తిచాతురిన్

అవ — ఇదేమిబుద్ధి మాలతీ! ఇంతకు మున్ను, మాధవుఁ డొక్క నిమిష మటు వెళ్లినాఁడో లేదో, అప్పుడే బెంగ పెట్టుకొని "ఆర్య పుత్త్రుఁ డింకా రాలేదేమి? ఎంతసేపటికి వచ్చునో! ఎప్పుడు చూతునో! రానీ! జంకు గొంకు విడిచి చెప్పవాల్చకుండ కన్నులు విప్పి చూచుచు నడిగెదను. రెట్టింపుతమకముతో గట్టిగా కౌఁగిలించెదను" అని నాతో నిపుడేకదా అన్నావు! ఇంతలోనే మఱి యిట్లు మాఱిన దేమి?

(మాలతి అసూయతో నామెను చూచును)

మాధ — (అపవారించి) అహో! కాముందకి ముఖ్యశిష్యురా లైనయవలోకిత చాతుర్యము సర్వలోకవిఖ్యాతముగదా! ఏమి సమయస్ఫూర్తి? ఎంతసహాసములు! ఎంతసరసములు? ఇవి మాటలు కావు, మాణిక్యములు. (ప్రకా) ప్రేయసీ! అవలోకిత చెప్పినది సత్యమేనా?

మాల — (తల యాడించును)

మాధ — నోటితో చెప్పకపోతే అవలోకితాలవంగికలతోడు సుమీ!

మాల — నే నేమీ యెఱుఁగను — (అనఁబోయిసిగ్గు)

మాధ — సెబాసు! మాట పూర్తికాక పోతే నేమి? ఎంతశ్రావ్యముగా నున్నది! (అని మొగము నిరీక్షించి తొందరతో) అవలోకితా! ఇదేమి?

గీ. ఈరమణియాస్యకాంతిసుధారసంబుఁ
గ్రోలఁ జంద్రుండు విమలకపోలపాళి
నునిచినమయూఖబిసకాండ మన నదేమొ
వఱలుచున్నది చూడుమా బాష్పధార!

అవ — సఖీ! కంట నీరు పెట్టుచున్నావా? అదేమి?

మాల — చెలీ! లవంగికను చూచి యెన్నాళ్లయినదో! దానిని విడిచి యుండలేక — ఆసఖి యెక్కడ నున్నదో వార్తకూడా లేదు.

మాధ — అవలోకితా! ఈమాట యేమిటి?

అవ — మహాభాగా! మరేమీ లేదు. నీ విపుడన్న మాటలనుబట్టి లవంగికను తలఁచుకొని దానిజాడ తెలియక పోయె నని యుత్తలపడుచున్నది.

మాధ — "ప్రచ్ఛన్నముగా నందనుని యింటికి వెళ్లి యక్కడిసంగతులు తెలిసికొని రమ్మ" ని యిపుడే కదా కలహంసుని పంపి

నాపు. (అభిలాషతో) అవలోకితా! అయితే, మదయంతికను గూర్చి బుద్ధరక్షిత చేయు యత్నము సఫల మగు నందువా!

అవ — మహాభాగా! శార్దూలనఖనిహతుఁడైన మకరందునికి తెలివి వచ్చిన దని చెప్పిన మాలతికి తగిన బహుమాన మిమ్మని భగవతి చెప్పఁగా, అపుడు నీవు హృదయజీవితము లర్పించినావు. ఇపు డైనరైనా మకరందునికి మదయంతిక లభించిన దని శుభవార్త చెప్పుదు రనుకో, వారి కేమి పారితోషిక మిచ్చెదవు?

మాధ — అడుగఁ దగిన దడిగినావు (తొమ్ముచూచుకొని) ఇదిగో, మదనోద్యానమున కలంకార మైన కేసరవృక్షముక్రింద మాలతీ ప్రథమసందర్శనమునకు సాక్షి యైన వకుళమాల సిద్ధముగా నున్నది. ఇది యసాధారణము —

ఉ. ఏను రచించి నట్టి దను చిష్ట సఖీమణి తెచ్చె నంచు, నెం
తేని భుజాంతరాళమున కింపుగ సొంపుగ దీనిఁ దాల్చి, నా
పై నెద నిల్పి, వాంఛకు నపాయము తోఁచినయంతఁ జావఁగాఁ
బూని, లవంగి నే ననెడుబుద్ధిని నామెడ వైచె వెండియున్.

అవ — ప్రియసఖీ! ఈవకుళమాల నీకు ప్రాణప్రియ మైనది. ఇపుడాశుభవార్త చెప్పినవారిచేతికి పోనున్నది —

మాల — చెలీ! ఆమూల్యము ప్రియతమము. నీ చెప్పిన మాటయు మిక్కిలిప్రియము. నీ వుపదేశించినట్లు చేయుదును.

అవ — (వినుట యభినయించి) కాలిచప్పుడు వినవచ్చినది.

మాధ — (తెరవంకచూచి) సెబాసు! అడుగో కలహంసుఁడు.

మాల — ఆర్యపుత్రునికి జయము జయము. మకరందునికి మదయంతిక లభించినది —

మాధ — ( మాలతిని కౌఁగిలించి ) కోరిక సిద్ధించినది, సంతోషము సంతోషము. ( అనుచు వకుళమాల నామెమెడలో వేయును )

అవ — భగవతి తలఁచినపనిని బుద్ధరక్షిత నెఱవేర్చినది.

మాల — ( సహర్షముగా ) నాప్రియసఖి లవంగిక యింక మనదగ్గఱకు వచ్చును. ( అని లేచును )

(అంత, తొందరపడుచున్న కలహంసుఁడు, బుద్ధరక్షితా లవంగికామదయంతికలు ప్రవేశింతురు.)

అందఱు — రక్షించు రక్షించు మహాభాగా! మార్గమధ్యమున నగర రక్షకభటులు మకరందు నడ్డగించినారు. ఆసమయమునకు వచ్చిన యీకలహంసకునితో నతఁడు మ మ్మిచ్చటికి పంపెను.

కల — మే మిటు వచ్చుచుండఁగా పెద్దరొద వినిపించినది. దానినిబట్టి క్రొత్తబలము కొంత వారికి తోడయిన దని యనుకొన్నాను.

అవ, మాల — అయ్యో! సంతోషముతో విషాదము కూడా సిద్ధమైనది.

మాధ — మదయంతికా! స్వాగతము. నామిత్రుని వరించి నీవు మాయిల్లలంకరించినావు సంతోషము. ఇంక మకరందుఁ డొక్కఁడే పెక్కండ్రతో పోరాడవలసి వచ్చె నని సంశయింపవద్దు. అతని కిది యొక లెక్క కాదు. మీ రందఱు స్వస్థచిత్తలై యుండుఁడు. భయపడ నక్కఱలేదు. ఏ మందురా ?—

ఉ. సింగ మొకండ యయ్యు బహుసింధురమస్తవిదారణక్రియా
భంగురభంగి కెంతయు నవక్రపరాక్రమసాహసంబు లా
రంగ, గడంగ దాని కిభరాజశిరఃప్రబలాస్థిఘాటనా
సంగనిశాతచండనఖశాలికరంబ కరంబు తోడగున్.

అయినా, విక్రమవిహారవిలాసభాసురుం డగు నాప్రియమిత్రుని కేను తోడయ్యెద. (అనుచు వికటపదన్యాసముగా పరిక్రమించి, కలహంసునితో నిష్క్రమించును.)

అందఱు — అప్రతిహతపరాక్రములై యీమహానుభావు లిరువురు తిరిగి వత్తురు గదా !

మాల — సఖీ బుద్ధరక్షితా ! చెలీ అవలోకితా ! మీ రిద్దఱు త్వరగా వెల్లి యీవృత్తాంతము భగవతికి విన్నవింపుఁడు. చెలీ లవంగికా ! వెంటనే వెల్లి నాయార్యపుత్త్రునితో నామాటగా నిట్లు చెప్పుము. "మీయిరువురకు మాయిరువురిపై సంపూర్ణ మైన దయ గలదేని జాగరూకులై పరాక్రమింపవలెను"
(మాలతీమదయంతికలు తప్ప నందఱు నిష్క్రమింతురు)

మాల — అబ్బా ! ఇంక నీసమయ మెట్లు వెళ్లఁబుచ్చవలెనో తెలియకున్నది. కానీ ! అటుపోయి లవంగిక వచ్చెడిదారి కాచుకొని యుందును. (పరిక్రమించి యనుమానముతో) కుడిక న్నదరుచున్నది. ఇదేమో ! (కూర్చుండును)

(అంత, కపాలకుండల ప్రవేశించును)

కపా — ఆఁ ! పాపాత్మురాలా ! ఉండు, ఉండు.

మాల — (భయముతో) ఆర్యపుత్రా ! హా ! హా ! (అని, మఱి మాటాడలేకపోవును)

కపా — (కోపముతో నవ్వుచు) ఏడు, ఏడు, ఇంకా ఏడు.

గీ. కన్యకాజారుఁడు తపస్వీఘాతుకుండు
నీవిటుఁడు నీమగండు ని న్గావఁ గలఁడె ?

మీనపంక్తిఁ గొని డేగ భ్రమింగునట్లు
మిసమిసలు జేయునిసు సేన భ్రమింగురాగా.

దీనిని శ్రీపర్వతమునకు తీసుకొనిపోయి ముక్కముక్కలుగా నఱికెదను. (మాలతిం గైకొని నిష్క్రమించును)

మద — హా! నేనుకూడా మాలతియున్న చోటికే పోయెదను (పరిక్రమించి) సఖీ మాలతీ!

లవం — (ప్రవేశించి) నేను లవంగికనే!

మద — ఆమహానుభావుఁడు కనఁబడెనా? చెప్పినావా?

లవం — లేదు లేదు. ఈయుద్యానావరణముదాఁటి పాలనమునలో వినఁబడ్డ యీకలకలము వైపు తోడ చలిచి మహాకోపముతో నతఁడు గబగబ పరుగెత్తుకొనిపోయి శత్రుసేనలో ప్రవేశించెను. ఇంకే నా కెట్లు కనఁబడును? దిక్కుమొగములో మరలి వచ్చినాను—కాని, గుణపక్షపాతులైనపౌరులయింటింట "అయ్యో సుస్వభావా! మాధవా! సాహసికా మకరందా!" అనెడి జాలి మాటలుమాత్రము వినఁబడ్డవి. మంత్రులకన్నెలను మోసము చేసి తీసికొనిపోయినారు అన్నవార్త విని మహారాజు కోపముతో వెంటనే కొందఱు యుద్ధభటులను పంపించి తాను మహాసౌధ శిఖర మెక్కి చూచుచున్నాఁడనియు విన్నాను.

మద — అయ్యో! ఎంత దురదృష్టవంతురాలను?

లవం — సరే కాని, మాలతి యేది?

మద — ఇంతకు మునుపే, ఆమె నీవు వచ్చేదారి కాచుకొని యుండుదనని వెళ్లినది. తరువాత నాకు మరలఁ గనఁబడలేదు. ఒకవేళ పూలతోటలోనికి వెళ్లినదేమో?

లవం — అయితే నడు. వెదకుదము. అసలే ఆమెకు భయ మెక్కువ. ఈసమయమునం దీయారామములో నొంటికత్తెయై యెంత దిగులు పడుచున్నదో !

మద — లవం — ( తొందరగా పరిక్రమింతురు ) సఖీ మాలతీ ! ఎక్కడ ? సఖీమాలతీ ! ( పిలుచుచు తిరుగుదురు )

కల — (సంతోషముతో ప్రవేశించి) అమ్మయ్యా ! దేవునిదయవల్ల నెట్లో బ్రతికి బయటఁ బడ్డాను. అబ్బా ! ఏమి పోరాటము ! బలరాముఁడు నాగటితోయమునానదిని భేదించినట్లు మకరందుఁడు విశృంఖలనృత్తిని విజృంభించి పైఁబడి శత్రుసేనను భేదించి విచ్ఛిన్నము గావించుట యిప్పటికిని చూచుచున్నట్లున్నది. ఔరా ! పోరు విడిచి పాఱిపోవుపీరభటుల యాయుధము లూడలాగి, వానితో నిలచినసైనికుల నుక్కడఁగించుచు ప్రచండమారుతముమాడ్కి రణరంగమునలుఁగడల వీరవిహారము సల్పినసా ప్రభు వగుమాధవునిపరాక్రమలీల యిప్పుడు కంటఁ బడుచున్నట్లు భావించుచున్నాను. అహో ! మాధవమకరందులబాహుబల పరాక్రమంబులు సహింప నోపక సంగ్రామరంగమువిడిచి తక్కిన పరబలంబు పిక్కబలము చూప ప్రేక్షకజనమునుండివెడలి మిన్నుముట్టినకోలాహల మిపుడు చెవిని బడుచున్నట్లున్నది — ఆహా ! నరేంద్రుని గుణపక్షపాత మెన్నఁదగినది గదా ! తనభటవర్గము పలాయితము కాఁగా మేడదిగి వచ్చి ప్రతీహారులు సవినయముగా విన్నవించినమాటలనుబట్టి వైరభావమువిడిచి సౌమ్యభావముతో మాధవమకరందులను దనచెంతకు రావించుకొని వారిముఖములు మఱిమఱిచూచి, వారిచెంగట నున్ననావలన వారికులగోత్రాదులు విని, సంతోషించి రత్నాభరణాదుల నిద్దఱిని

సత్కరించి, ఈర్ష్యామాత్సర్యంబులు గ్రక్కుచున్న ముఖముల తోడి భూరివసునందనులను మృదుమధురవాక్యంబులఁ బ్రసన్నులఁ గావించి, నవయౌవనాభిరాములు వీరలోకాలంకారభూతులు మహానుభావులు నగు వీ రిద్దఱు మీయిద్దఱికి జామాతలగుట కానందింపుఁ డనిబోధించి ప్రాసాదములోని కేగిన యామహారాజు నౌదార్యము నెన్నఁ‌టికిని మఱువఁజాలను. బళీ! — ఇఁక మాధవమకరందు లిచ్చటికి వత్తురు. నేను వేగమ పోయి యీ వృత్తాంతము భగవతికిఁ దెల్పెదను. (అని నిష్క్రమించును)

(అంత మాధవమకరందులు ప్రవేశింతురు)

మాధ — ఆహా! మహనీయమైన నామిత్రుని పరాక్రమము సర్వాతిశాయిగదా!

చ. తొలుతఁ బరాక్రమం బడర దోర్యుగళిం బరిమార్చి శత్రుయో
ధుల, నట వారికై దువులతోఁ బ్రహరింపఁగఁ దక్కువారి, వి
వ్వాలు లయి చేష్ట దక్కి యిరువంకఁ బదాతిబలంబు వారివె
న్కల నిలవంగ, నల్లదె కనంబడు సంగరరంగ మత్తినాన్.

కాని, మిత్రమా! యిదిమాత్రము పశ్చాత్తాపపడవలసిన విషయమే సుమీ! చూడు —

ఉ. ఈనిసిఁ గౌఁగిటం గులుకు చింతులు కంతునివేడ్క మీఱ ముం
దాని యొసంగినట్టి మధు వానినవీరభటుల్ రణంబునన్
నీనిశితాయుధాహతుల నీల్గుచు ఛీ యని రోసియుందు రెం
తేని నిరర్థకంబు సుఖహీనము మానవజన్మ మంచెదన్.

పోనీ! ఈగొడవ యింకెందుకుగాని, మిత్రమా! రాజుగారి

సౌజన్యముమాత్రము మఱవరానిది సుమీ! మనము తప్పు చేసినా, నిరపరాధుల మనుబుద్ధితో మనలఁ గానుక లిచ్చి సత్కరించినారు. ఔదార్య మంటే, అది గదా! సరేరా! మాలతీసముత్సుకమంటే మదయన్తికావారణవృత్తాంతము సవిస్తరముగా ముచ్చటించుకొందము (ముందు చూచి) ఈప్రదేశమంతా శూన్యముగాఁ గనవచ్చుచున్నదే! ఎవరును గనఁబడరే!

మక — మనము పోరాటము సలుపుచున్నందుకు మనస్సు కలఁత చెంద నీయుద్యానమునసే యందందు తిరుగుచు సమయము గడపుచున్నారనుకొందును.

మాధ — వయస్యా! ఇప్పుడు,

చ. చెలులకు నీవు యుద్ధమున చిత్రకథల్ వినిపించువేళఁ, గ
న్నులు విరియఁగ మాలతి తనుం గనుచో, మదయంతి సంశయా
విలము త్రపాకులంబు భయవిస్మయహర్ష దయాంచితంబు ని
శ్చలనయనంబు నైనముఖసారస మించుక వంచెనుం జుమీ!

ఇదే యుద్యానవాటము. (ప్రవేశము నటింతురు)

లవం, మద — సఖీ మాలతీ! — (ఆత్రముతో చూచి) ఆమహానుభావు లిద్దఱు మరలఁ గంటఁబడ్డారు.

మాధ, మక — మాలతి యెక్కడ?

లవం, మద — మాలతి యెక్కడనో! మీయడుగుల చప్పుడు విని మాలతి యనుకొని మోసపోయినాము.

మాధ — ఏమిది? నిజము చెప్పండి నాహృదయము వేయిముక్కలగుచున్నది. హా! హతాశుఁడ, దైవోపహతుఁడ —

గీ. ప్రాణసఖి కెప్పు డేకీడు ప్రాప్త మగునో
యనుచు శంకించుచుందు నే నాత్మలోన,
అది నిజం బన నెడమకన్ను దరె నిపుడు
మది దహించుచునుండె మీమాట కూడ.

మద — మహానుభావా! మీ రటు వెళ్ళంగానే, మాలతి అవలోకితా బుద్ధరక్షితలను భగవతి చెంతకు పంపించి, అప్రమత్తులై మెలంగుండని చెప్పుటకు మీవద్దకు లవంగికను పంపి, యీసఖి యింకా రాలే దని యెదురుచూచుట కాదారికై వేగినది. పదినిమిషములు చూచి నే నామెకై యటు పోయితిని. కాని, యామె కనబడలేదు. అప్పటినుంచీ యిప్పటివఱకును మే మీవనాంతర మంతా కలయ వెదకుచునే యున్నాము.

మాధ — హా ప్రేయసీ మాలతీ!

ఉ. ఏమయినావో నీ వనుచు నెంతయు నుల్లము తల్లడిల్లు, నో
భామిని! కోపగించితివె? భావ మెఱుంగఁగ దాఁగినావె? రా
వే మఱి! నవ్వులాల కిటు లేఁచుట నాయమె? పల్కవేమి కాం
తామణి! జాలి లేదె? యికఁ దాళఁగఁ జాల, మొగంబు చూపవే!

మద — లవం — హా ప్రియసఖి! ఎక్కడున్నావు తల్లీ?

మక — వయస్యా! విషయ మేమో తెలియకుండ ముందీవిచారమేల?

మాధ — అయ్యో మిత్రమా! మాలతి భయశీలురా లని నీ వెఱుంగవా? నామీఁది గాఢానురాగమున నేను గనఁబడనిచో నెట్లు సాహసించునో కదా!

మక — ఆమాట నిజమే యందము. కాని, మాలతి భగవతిచెంతకు వెళ్లిన దేమో యని నాయనుమానము. అక్కడికే కేగుదము రా!

మద — లవం — మాకు కూడా అట్లే తోఁచుచున్నది.

మాధ — సరే కానిండు. ( పరిక్రమించును )

మ:క — ( తనలో )

ఉ. ఆమహాసీయురాలిఁ గన నచ్చటి కేగినయేని యీమెకున్
సేమమొ, కాని యాగృహము చేరెనొ లేదొ యటంచు శంకచే
నామది తత్తఱిల్లెడుఁ గనంబడి పోవుచునుండుఁ గాదె సౌ
దామనిమాడ్కి బంధుహితదారసమాగమసౌఖ్య మంతలో ?

( అని యందఱు నిష్క్రమింతురు )

ఇతి మా-లత్యపహరణ మను అష్టమాఙ్కము

---

# మా ల తీ మా ధ వ ము

## న వ మా ఙ్క ము

### వి ష్క ం భ ము

( అటుపిదప సౌదామని ప్రవేశించును )

సౌదా — నా పేరు సౌదామని. నేను మాధవుని చూడఁగోరి శ్రీపర్వతమునుండి పద్మావతీపురమునకు వచ్చితిని. అతఁడు మాలతీవిరహదుఃఖితుఁడై మున్ను తా నున్నయిల్లు విడిచిపెట్టి మిత్రవర్గముతో బృహద్ద్రోణీశైలకాననమున కేగె నని విని యిప్పుడచ్చటికి పోవుచున్నాను. ఆహా! నే నెంతపైకెగసితినో, గిరినదీకాననపురగ్రామపరిశోభిత మయిన యీభూతలప్రదేశ మంతయు నంత విస్పష్టముగా కన్నులకు కట్టినట్లు తోఁచుచున్నది. అహో! ఉభయసరిన్మధ్యవర్తియై మహోన్నతసౌధగోపురాట్టపరంపరావిరాజమాన మైన యీపద్మావతి శోభామహిమ వర్ణనాతీతము గదా!

గీ. నాకపురలక్ష్మితో నిది డీకొనంగ
నాకసము చీల్చికొని పోవునపుడు దీని
ప్రక్కలం బడ్డయానింగిముక్క లనఁగ
సింధుపారానదుల్ విరాజిల్లుచుండె.

అదిగో లవణానది. జానపదులయాదరాభిమానముల కది జన్మభూమి. వర్షాకాలమున వఱదలై పాఱుదానిపరిసరకాననభూములందు గోగర్భిణులకు ప్రియతమమైన ఉలపమాల యనెడితృణవిశేషము చక్కఁగా పెరుగును. అల్లదే దూరమున నుత్తరముగా రసాతలమును

దొలిచివేయుచున్న సింధుజలధారాప్రపాతము, కాలమేఘగర్జితమువలె ప్రచండమై యెప్పుడు నొక్కరీతిగా వినవచ్చుదానిగంభీరధ్వానము గజాననుని కంఠధ్వనిమాడ్కి కర్ణానందముగా నుండును. అవిగో, చందనాశ్వకర్ణ సరలపాటలాదితరుగహనములతోడి మహారణ్యాగిరి భూములు, కదంబ జంబూద్రుమాది విపినవిలసితంబులును, గిరినికుంజగుంజద్గంభీరఘోషణ గోదావరీముఖరితంబులు నగుమేఖలాంభూములతోడి దక్షిణారణ్యభూధరంబులను స్మృతికి తెచ్చుచున్నవి.

ఈకనవచ్చెడిది మధుమతీసింధునదీసంగమము. ఈక్షేత్రమందేనాఁడో స్వయముగా వెలసిన స్వర్ణబిందునామకశివలింగము విలసిల్లుచుండు. చేతులుజోడించి నమస్కరించుచు —

గీ. సకలభువనాదికారణా! జయము జయము,
సర్వనిగమాత్మభావనా! జయము జయము
చంద్రశేఖర? మదనారి! జయము జయము
జంగమస్థావరాత్మకా! జయము జయము.

(గమన మభినయించి) ఇది బృహదశ్మపర్వతము. నవజలధరావాసశిఖరము మత్తమయూరనివాసము నైనయిది నేత్రపర్వముగా నున్నది. ఇందు —

గీ. ఘోరభల్లూకములు కొండగుహల నుమియు
నట్టిచప్పుడు మఱుమ్రోఁత నధిక మయ్యె,
కరులు విఱిచినసల్లకీతరులనుండి
వెడలురసముసుగంధంబు విరియుచుండె.

(పైకి చూచి) అప్పుడే మధ్యాహ్న మైనది. ఇఁక మాధవమకరందులను వెదకి పట్టుకొని ప్రస్తుతకార్యము సాధించెద. (నిష్క్రమించును)

ఇది విష్కంభము

( అంత మాధవమకరందులు ప్రవేశింతురు )

మక — ( దుఃఖముతో నిట్టూర్చి తనలో ) ఔరా! దుర్విధివిలాసము! ఆసతీతిలక మాామాలతి యెందును కనరాకున్నదిగదా!

చ. తెగువయు నేర్పు తేకువయుఁ దెల్వియుఁ గల్గిన నేమి? యింతకున్
మృగములమాడ్కి నిట్టటు చరించితి, మీావిపదంబుధిం దరిం
పఁగ గతి గానరాదు కనుపట్టును మాలతి యన్నయాశ పో
దగపడ దాసతీమణి, కటా! యిఁక మేము వెలుంగు చూతుమా?

మాధ — హా ప్రాణప్రియా మాలతీ! ఎందున్నావు? మాకు దారియు తెన్నును తోఁచని-చోట నద్భుతముగా నంతరించినావా? నీ వంత నిర్దయురాలవా? కనఁబడవా? అనుగ్రహింపవా?

చ. ఎవనికి నీవు ప్రాణమయి తెవ్వఁడు నీకును బ్రాణ మయ్యెనో,
యెవనిని జూడ కీవు తపియింతువో, యాచెలికాఁడ నేను మా
ధవుఁడను, నామొడం బొగడదండను వైచుచుఁ గన్నుదోయి కు
త్సవ మగు రత్నకంకణలసత్కరపద్మము చూపవా చెలీ?

మిత్రమా మకరందా! మాలతీ స్నేహమువంటిస్నేహము దుర్లభము సుమీా! దాని కదే సాటి.

గీ. నన్ను మనసారఁ బ్రేమించునాఁటనుండి
యొడలు మదనజ్వరాగ్నిలో నుడుకుచుండ,
తుదకుఁ బ్రాణంబు విడువంగ మదిఁ దలంచె
నేమివర్ణింతు నాస్నేహ మింతకన్న?

వయస్యా! ఇం తేందుకు?

చ. వినవోకో? అమ్మవారిగుడిఁ బెండ్లికి ముందు, లవంగికం గనుం
గొని తనకోర్కి తీర దనుకొందలపాటున న స్థలంచి యే

మని విలపించెనో, హృదయమందలిభావము లేమి దెల్పెనో!
మనసు దహించుచుండె నవి, మాలతిచెల్మికి మాఱు లేదిలన్.

అహహా! స్నేహమూర్తీ ప్రాణేశ్వరీ!!

చ. హృదయము బీటదీసెను మఱెందుకు బద్దలుకాదొ? మేను పె
ల్లదరుచు మొద్దువాఱె విడనాడదు తెల్వి నదేమొ? దేహమున్
బొదిగొని కాల్చు దుఃఖశిఖ బూడిద చేయ దదేమొ? మర్మముల్
వదలక కోయుచున్న విధి ప్రాణము తీయ దదేమి పాపమో?

మక — వయస్యా! పూర్వజన్మపాపమువలెనే మధ్యాహ్నసూర్యుఁడు కూడ నిర్దయుఁడై దహించుచున్నాఁడు. నీశరీరావస్థ చూడ నిట్లున్నది. కావున నీచెఱువుగట్టుమీఁది చెట్లనీడ నొకింత విశ్రమింతువు గాక. రమ్ము పోదము - ఇందు —

గీ. సరసిఁ దోలఁకాడు తరఁగల నొరసికొనుచు
నపుడు విరిసినతామరలందు తొరఁగు
తేనె నంటి సుగంధంబు లీనుచల్ల
గాలి ప్రాణంబులకు హాయిగాఁగ వీచు.

(పరిక్రమించి యుపవసింతురు)

మక — (తనలో) ఇతనిదృష్టి నిటు త్రిప్పెదను (ప్రకా) వయస్యా! ఈసరోవరరామణీయకము తిలకించితివా?—

మ. కలనాదం బొనరించుహంసముల తెక్కల్ సోఁకఁ దూఁగాడుతూఁ
డుల భాసిల్లెడు తెల్లతామరలచోటుల్ వేఁడికన్నీటిచు
క్కలచా లొల్కుచు వెండి పుట్టునడుమన్ గన్గొమ్ము కన్నార మం
జులసత్పంకజలక్ష్మి నీకుఁ గనిపించున్ నైజరమ్యాకృతిన్.

మాధ — (సోద్వేగముగా లేచును)

మక — ఇదేమి ? నామాట వినిపించుకొనక లేచి మఱియొక చోటి కేగఁ జూచుచున్నాఁ డెందుకో ? అయ్యో ! ( లేచి ) మిత్రమా ! శాంతించి యిటు చూడు— ప్రబ్బచెట్లపువ్వులు రాలి పరిమళించు నాయేటిని తిలకింపుము. దానియొద్దున నున్న యడవి మొల్ల లానది నెట్లు పూజించుచున్నవో చూడు. ఆగిరిమల్లికలపువ్వులతో నవ్వుచున్నట్లున్న ముందుభాగములు చూచితివా ! ఈకొండచఱియల నాశ్రయించిన మేఘములను గంటివా ? మయూరములు నృత్య మొనరింపఁ గట్టిన మేల్కట్ల వలె నెట్లు విలసిల్లుచున్నవో ! ఆకొండమీఁది కడిమిచెట్లు చూడు మిత్రమా ! మొగ్గలు పువ్వులు వెలయఁ గన్నుల పండువుగా నెట్లున్నవో! చూడు మాలోయలోని కేతకీద్రుమావళి వికసత్కుసుమసురభిగంధ మెట్లు ప్రసరింపఁ జేయుచున్నదో ! మఱియు నిది కనుఁగొనుము, ఆదిగంగనలయుర స్తటంబులు నీలమేఘమాలావిరాజితంబులై యెట్లు నిగనిగలాడుచున్నవో ! ! ఆహా ! ప్రకృతిసౌందర్యము ! !

మాధ — మిత్రమా! చూచుచున్నాను. ఈప్రదేశ మత్యంతరమణీయమే. కాని, యీదశలో నేను చూడఁజాల కున్నానుగదా ! నా కిపుడీయుపదేశ మేమిటి ? ( కన్నీటితో ) హా ! ఏమిది ? — ఇఁక నేమున్నది ? —

గీ. వానగాలికి నొడ లెల్ల వణఁకునట్లు
గర్జనంబున కుల్లంబు కలఁగునట్లు
కకుభసాలాదికుసుమసుగంధ మలర
వచ్చి నాఁమీఁదఁ బడె వర్ష వాసరములు.

హా ప్రేయసీ మాలతీ ! ఎం దున్నావో !

చ. కన నగునే యిఁకన్ జలదకాంతిఁ దటిద్గతి నింద్రచాపమున్ ?
వినఁదరమౌనె గర్జలును వీను లదర్చెడి కేకికేకలున్ ?
తొనఁకదె వానగాలి కెద ? తుంపెసలాడదే మేను తుంపరన్ ?
మన నిఁక మేఘమాలఁ గని, మాలతిఁ బాసినజన్మ మేటికిన్
(నిట్టూర్చి శోకమునటించును)

మక — (చూచి) అయ్యో! మిత్రుని కెంతదురవస్థ వచ్చినది?
(ఏడ్చుచు) నే నీవినోదము కల్పించి తప్పు చేసితిని (వణఁకుచు)
అయ్యో! మామాధవుఁ డింక లేనట్లే, ఇ దెక్కడిమూర్ఛయో ?
ఓసాధ్వీమణీ మాలతీ!

గీ. మాధవునిమీఁదికోర్కి ముమ్మరముగాఁగఁ
తల్లిదండ్రులయనుమతిఁ దలఁప కీవు
సాహసించితి విప్ర డీచర్య యేమి ?
కరుణవిడనాడుదే మనోహరునిమీఁద ?

(మాధవుని చూచి) ఇంకా తెలివి రాలేదు. అయ్యో ? మోస
పోయితిని. హా మాధవప్రేయసీ!

శా. హాదేవీ! జగ మెల్ల శూన్య మిదె కీళ్ళల్లాడుఁ బట్లూడి, యు
న్మాదం బెత్తి మహాంధకారమున మున్గం జొచ్చె జీవాత్మయున్
ఛేదిల్లున్ హృదయంబు మూర్ఛ యలమెన్ ధీంద్రించె దుఃఖాగ్ని హా
హా! దీనుండను మందభాగ్యుఁడను, రావా కావవా మాధవున్ ?

హా కష్టము కష్టము!! బంధుహృదయకౌముదీమహోత్సవము
మాలతీ నయనబాలచంద్రుఁడు జీవలోకతిలకంబు మకరందహృదయా
నందవర్ధనుండు విలయ మొంద నున్నాఁ డక్కటా! వయస్యా! కమనీయ
మూర్తి వగునిన్ను హరింపఁ జూచుదుష్కాలము నాప్రాణము వెల్లగించు
చున్నట్లున్నది. హా మిత్రమా! (మేను తాఁకుచు)

గీ. చూడవా నన్నుఁ జిఱునవ్వుతోడికనుల ?
మాటలాడవ ? మాధవా ! మఱచినావ ?
నేను మకరందుఁడను నీదు నేస్తకాఁడ
వేయికన్నుల మాలతిన్ వెదకువాఁడ.

మాధ — ( తెలివి గాంచును )

మక — ( నిట్టూర్పుతో ) అమ్మా ! ఆనవజలధరుఁడు శీతలతోయశీకరాసారమున నాప్రాణమిత్రుని బ్రతికించినాఁడు

మాధ — ( నిశ్వసించును )

మక — నిట్టూర్పు విడిచెను. చాలు. పరమానందము.

మాధ — ఈయడవిలో నాప్రియురాలికి నాసుఖవార్త తెలుపుట కెవరిని పంపుదును ? ముందువైపు పరికించి —

గీ. ఓ ! మహాభాగ్య మీయేటి కుత్తరమున
నీలిమఁ దమాలతరువుల నీలమణుల
నోర్చునభినవతోయవాహుండొకండు
కొండకొమ్మెక్కి కూర్చుండియుండె నడుగో !

( తొందరతో లేచి యతని కెదురుగ నిలచి దోసిలియొగ్గి )

చ. జలధర ! కౌఁగిలించునొకో చంచల నీప్రియకాంత నిన్ను ? ని
చ్చట నినుఁ గొల్చుచున్నవొకో చాతకముల్ సుముఖంబులై ? మనం
బలరఁగ సేవచేయునొకో యాపవనుం డనువర్తియై ? మహో
జ్జ్వల మగునింద్రచాపమును వైభవచిహ్నగఁ జేతఁ బట్టుదే ?

(శ్రవణ మభినయించి) ఆఁ ! కందరములు ప్రతిధ్వనించున ట్లానందించిన నెమళ్ళొనర్చు కేకారవమువలె నింపై గంభీర మైన వాఁ డిమ్మనెడి నాదంబున నామాటల కనుమోదముచూపుచున్నాఁడు. ఇపుడు కోరిక తెలిపి ప్రార్థించెదను. ఓపూజ్యుఁడ వైనజీమూతా !

ఉ. తరుణి కృశాంగి మాలతిని దైవవశంబునఁ గాంతువేని ముం
దర తగ నూఱడించి యటఁ దత్ప్రతి మాధవు నొందుదుర్దశా
పరిణతిఁ దెల్పు మాశకు రవంతయు భంగము రానియట్లు, న
న్నరయుదు వన్నయాశ కద యాసతిప్రాణము నిల్పు నింతకున్ !

(సంతోషముతో) ఆఁ! కదలెను. కానీ! ప్రియురాలిని వెదక నే నింకొకచోటి కేగెదను (పరిక్రమించును)

మక — (విచారముతో) అకటా! ఇతనికి మదనోన్మాదము హెచ్చినది. అయ్యో! ఓగురువులారా! ఓభగవతీ! మాధవునిదుర వస్థ చూడండి రక్షించండి —

మాధ — (ముందు చూచి) అయ్యో! ఇం కేమున్నది? కొంప మునిఁగినది.

గీ. కరులు లోధ్రంబును లతలు హరిణములును
గమన మార్దవ నమ్ర తేక్షణములందు
కనఁబఱుచుక్రొత్తసొంపు లెక్కడివి? యకట!
నాసతిని బొట్టఁ బెట్టుకొన్నవి నిజంబు.

హా ప్రాణేశ్వరీ మాలతీ!

మక — (కన్నీటితో)

గీ. చిన్నతనముననుండి నాచెలిమికాఁడు
నాబహిఃప్రాణ మీసుగుణాలరాశి
మాలతీవిరహాగ్నిచే మ్రందుచుండ,
పాడుహృదయమ! రెండుగాఁ బగుల వేమి?

మాధ — (ఊహించి) ఈసృష్టిలోని వస్తువులలో నొకదానిని పోలిన దింకొకటి కనవచ్చుట నైజముకదా? అంతే, మాలతి జీవించి

యుండును. (బిగ్గఱగా) ఓగిరికాననవాసు లగుజంతువులారా! మాధవుఁడు నమస్కరించి విన్నవించుచున్నాఁడు; ఒక్కమాట— దయచేసి వినండి —

చ. యువతి మనోహరాకృతి నవోఢ సుశీల యొకర్తె యిందు మీ
కెవరికి నైనఁ గంటఁ బడెనేని నచింపుఁడు, చూడరేని యా
ప్రవిమలగాత్రిఁ గూర్చి వనవాసులలోఁ బ్రసరిల్లువార్త మీ
చెవిఁ బడెనే నదేని వినఁజేయుఁడు నామది శాంతి నొందఁగన్.

(అటు తేఱిపాఱఁ జూచి) అయ్యో! ఇదంతా, అరణ్యరోదనమే.

సీ. ఆమయూరముగర్వ మేమందు? నామాట
వినకయే కేకలు వెట్టఁజొచ్చె
ఆచకోరముమదం బౌర! నాయాచన
నిరసించి తనకాంతసరస కేగె,
ఆకొండముచ్చు ప్రేయసికపోలములఁ బు
ప్పొడి పూయు వేడ్క నాగోడవ వినదు,
ఆకురంగము కురంగీకంఠమును గోఁకు
చవుర! నామొఱ పెడచెవిని బెట్టె,
గీ. ఆకరీంద్రుఁడు సహచరి ననునయింపఁ
జూచుమైకాన నావైపు చూడకుండె,
ఇంక నెవ్వరి నడుగుదు? నెందు చనుదు?
అక్కటా! దిక్కులేదు నే.నొక్క రుండ.

(ప్రక్కకు చూచి సంపముతో) ఆఁ! ఒకమదగజేంద్రుఁడు తనకరేణువుం గూడి యీసరోవరంబునఁ గ్రీడించి యొడ్డెక్కుచున్నాఁడు. ఇతని నడుగవచ్చును — ఓమహాభాగా నాగేంద్రా! శ్లాఘ్యమాన

యౌవనుఁడవు ప్రియురాలిని సంతోషపెట్టు చాతుర్యము నిజముగా నీసొమ్ము. కాని, చిన్నతప్పొకటి చేసితివి సుమీ!

ఉ. ప్రేయసి తూల్లు తిన్నతఱిఁ బ్రీతిగ నిచ్చితి దానినోటికిన్
దోయజగంధ మొల్కు నిజతుండములోనిజలంబు, వీఁపునన్
హాయిగ నీళ్లు చల్లితివి హస్తముతోఁ, దగుఁ గాని నెత్తిపైఁ
బాయనికూరిమిన్ గొడుగుపట్ట వదే మొకతామరాకునన్?

(దానివైపు మరలఁజూచి) అరే! అదేమి? మాటాడదు. నావంక చూడదు — అయ్యో! నే నెంతమూర్ఖుఁడను? నామిత్రుఁడు మకరందుని పల్కరించిన ట్లీవనచరమును పల్కరించుచున్నాను. హా ప్రియవయస్యా మిత్రమా!

ఉ. ఏ నిఁక నొంటిగా బ్రతుక, నేను సహింపను రమ్యవస్తుజా
తానుభవంబు, నిన్ను జలజాక్షిని మాలతిఁ జూడకున్నరో
జేని ముహూర్తమేని నశియించెదు, వేడుక లెండమావు లే
మేనియుఁ గోర్కి లేదు జగ మెల్లను శూన్యము మిత్రరత్నమా!

మక — ఉన్మాదమోహము పైకొని యున్నను, సహజమైనస్నేహవాసన యెట్లో పైకి వచ్చినది. ఆఁ! కానీ! (ఎదుటికివెళ్లి) మిత్రమా మాధవా! నేను నీదగ్గఱనే యున్నాను, భాగ్యహీనుఁడను.

మాధ — హా ప్రియవయస్యా! నన్ను కౌఁగిలించుకొనుము, నాప్రియురాలింకఁ గనఁబడదు. ఆయాశ వదలుకొన్నాను.

మక — (అట్లు చేసి చూచి యేడ్చుచు) అయ్యో! కౌఁగిలించినంతనే సంతోషము పట్టఁజాలక నిశ్చేతనుఁడైనట్లుండె. (ముఖము చూచి) హా మాధవా! కష్టము కష్టము. ఇంక నామిత్రుఁడు

లేఁడు. నే నెందు కీజీవముతో ? ( మెల్లగా (క్రింద పరుండఁబెట్టి ) హా ప్రాణమిత్రమా! మాలతీప్రేమ కారణముగా నీ కెపు డేమి కీడుమూడునో యని జంకుచునే యున్నాను. ఆభయము నిజమై యిపు డొక్కమాఱు పై కుబికి యణఁగిపోయినది — అక్కటా! అయితే నేమి? కడచినరోజులే మంచివి మిత్రమా! ( దుఃఖముతో ) ప్రాణాలతో కంటఁబడుచుండేవాఁడవు. ఇపు డది కలు వైన దయ్యో!!

గీ. మేను బరువయ్యెఁ బ్రాణాలు మేకు లయ్యె
నవయవంబులు నిష్ఫలం బయ్యె నాకు,
కటికిచీఁకటి యయ్యె లోకం బి దెల్ల,
తల్లక్రిం దయ్యె నక్కటా! తలఁపు లెల్ల.

ఇంక నేను జీవించుట మాధవుని యస్తమయమునకు సాక్షిగా నుండుటకే యగును. కావున నీశిఖరమునుండియే క్రిందఁ బ్రవహించు పాటలావతిలోఁ బడి మాధవునికి ముం దయ్యెదను ( మిత్రదేహము చేతులారఁ బట్టి )

చ. కలువల నీలమేఘములఁ గా దనునేమెయిచాయ మాలతీ
లలితవిలోకనంబు లెసలారఁగ నింతకు మున్ను గ్రోలె? న
చ్చెలు వగునీదుమేనఁ జెయి చేర్చినఁ గౌఁగిటఁ బట్టినన్ మనం
బలరద, యింతలోనె యిటులైతివె? మాధవ మోసగించితే?

( తేఱిచూచి ) ఔనౌను. మిత్రమా! ఒకొక్కచో, అభ్యుదయముకూడా అనర్థదాయకమే యనుట నిజమేసుమీ!

చ. అలరుఁ గలాభిరామత సుధాంశుఁడు రాహువునోటిపా లగున్
జలదుఁడు మింట తీవిగఁ గనంబడు మారుతుచేతఁబాడగున్

ఫలముల నిండి యుండువనపాదప మాపాలతి యూ దవాగ్నికిన్
వెలయుచునుంటి వీవు కడు విశ్రుతిఁ జిక్కితి విట్లు మిత్త్రికిన్.

సరే, ఇంకెందుకు? నన్నుఁ గౌఁగిలింపు మని యిపుడే కోరి నాఁడు (అనుచుఁ గౌఁగిలించి) హా విమలకలానిధీ! హానిరంతమాలతీభావనా! హాకామందకీమానసపుత్రా! ఇదే నాకడపటి కౌఁగిలింత. నేనింక జీవింతు ననుకోకు. బంధువులు విడుచు తర్పణోదకము నీ వొక్కఁడవే త్రాగుదువా? ఇదిగో ని న్ననుగమించుచున్నాను. (ఏడ్చుచు మిత్రుని విడిచి పరిక్రమించి) ఈక్రిందిదే పాటలావతి. భగవతీ తరంగిణీ! నమస్కారము. నాప్రియమిత్రుఁ డెం దేగునో నే నచ్చటికే పోవునట్లును అతఁ డెందు జన్మించునో నేనందే జన్మించునట్లును వరము లిమ్ము. (అనుచు, పడఁబోవును)

సౌదామని — (ప్రవేశించి) వత్సా! సాహసింపకు. వద్దు వద్దు. (అనుచు నడ్డగించును)

మక — (చూచి) తల్లీ! నీ వెవర వమ్మా? న న్నడ్డగించితి వేల?

సౌదా — నాయనా! నీవు మకరందుఁడవా?

మక — ఔను, ఆభాగ్యహీనుఁడనే.

సౌదా — నే నొకయోగినిని. మాలతి జీవించియున్న దనుట కానవాలుగా నొకవస్తువు తెచ్చితిని. ఇదిగో! (వకుళమాల చూపును)

మక — (నిట్టూర్చి) మాలతి బ్రతికియున్నదా హా!

సౌదా — నీ విట్లు సాహసించితి వేల? మాధవుఁడు జీవించియున్నాఁడా? నాప్రాణము గడగడలాడుచున్నది. చెప్పు నాయనా!

మక — అమ్మా! మూర్ఛపడినమాధవుని చూడలేక వైరాగ్యముతో లేచి వచ్చితిని.

సౌదా — అయి తే, రా! త్వరగా వెళ్లి యతనిని బ్రతికింతము ( ఇరు వురు పరిక్రమింతురు )

మక — ( చూచి ) దైవవశమున సుగ్రీవునికి తెలివి వచ్చినది.

సౌదా — మాలతి చెప్పినట్లు వీ రిద్దఱు నొక్కపోలికనున్నారు.

మాధ — ( నిశ్శ్వసించి ) అబ్బా! న న్నెవరో మేలుకొలిపినారు — ఈనవమేఘప్రభంజనుఁడు చేసిన దే యీపని. ఓయీ వాయు దేవా!

గీ. చాతకంబుల నెమళులఁ గేతకములఁ
దనుపఁగా రాదె? జలదాళిఁ దఱుమ రాదె?
దైవకృప మూర్ఛలో మనస్తాప మణఁగఁ
దెల్విరోగంబు నా కేల తెచ్చినావు?

మక — సకలలోకజీవనాధారుఁ డగు మారుతుఁడు మహోపకారమే చేసెను. ఆహా! ఈవర్ష వాయువు విరహిజనము నాకర్షించుచు న్నది గదా!

మాధ — అయినా, నిన్నే యొకటి కోరుచున్నాను. క్షమించు సదా గతీ! గంధవాహా! నీవు సర్వవ్యాపివి నాప్రియురాలిని మాలతి నెఱుఁగుదువుగదా!

శా. ప్రాణాధారము నీవు సృష్టికి జగత్ప్రాణా! మదర్ధాంగికిన్
ప్రాణాపాయము రాక మున్నటకు నా ప్రాణంబు గొంపోయి నా
యేణీలోచన కిమ్ము వేగముగ, నే నిచ్చోటనే యుండు, నా
ప్రాణంబుల్ నిలువంగఁ దెచ్చియిడుమా ప్రాణేశ్వరీవస్తువున్.
(దోసిలియొగ్గి) నాకు దిక్కు లేదు. నీవేగతి —

సౌదా — ఈదండ యిచ్చుట కిది తగినసమయము. (ఆ దోసిటిలో వకుళమాల పడ వేయును)

మాధ — (సంతోషాశ్చర్యములతో సాభిప్రాయముగా) ఇది నేను కామ దేవాయతనముచెంతఁ గూర్చుండి గ్రుచ్చినదండ కాదా? (పరిశీ లించి) సందేహ మేమి? అదే యిది —

చ. కమలదళాక్షి నారమణిఁ గన్గొనుచో నుదయించుకోర్కెఁ జి
త్తమున నణంచు చొక్కయెడఁ దప్పుగ గ్రుచ్చినయీసరంబు భా
గము గని యీలవంగిక మొగంబును గన్నులు నంతలయ్యె నా
సమయమునందు సత్యముగ, సత్యముగా నిది నాఁటిదండయే.

(హర్షోన్మాదపరవశుఁడై లేచి చండీ మాలతీ! కనఁబడుచు న్నావు. (కోపముతో) కాని, నాకష్టము గనకున్నావు కదా? హా మాలతీ!

చ. తనువు దొఱంగఁ బ్రాణములు తత్తఱమందుచు నుండె, గుండె బ
ద్దౌన నవియంగఁ జొచ్చె, విడిపోవఁగఁ జూచెను సంధు లెల్ల, చ
య్యనఁ జనుదెమ్ము నమ్ము పరిహాసము గా దిది, నాకనుంగవం
దనుపఁగఁ జూతువో? కరుణ దప్పి చరింతువా? నిశ్చయించుకో!

(అంతటఁ జూచి దుఃఖముతో) అయ్యో! ఇక్కడమాలతి యెట్లు? — (పొగడదండ చూచి) ఓసీ వకులమాల్యమా! మాలతీ ప్రియమిత్రమా! నీవొనరించిన మే లెన్నఁటికిని మఱవను — అనారతంబు నన్నెదఁ దలంచుచు మదనోద్వేగపరవశయై విరహానలంబునఁ బరితప్త యగునాప్రియసఖికంఠంబును నాకు బదులుగాఁ గౌఁగిలించి యాచెలి ప్రాణంబును నిలిపినదానవు నీవు గావా? (కన్నీరు విడిచి) ఓ మాల్య రాజమా!

గీ. మాతలంపులు తెల్పినదూత వగుచు
మామనంబులు గల్పినమంత్రి వగుచు
నస్మదానందసంతాపసాక్షి వగుచు
రాకపోకలు సల్పినసీకు నతులు.

( అనుచు దండ మెడలో వేసికొని మూర్ఛిల్లును )

మక — ( దగ్గఱ చేరి ) సఖా ! ఊఱడిల్లుము.

మాధ — (ఊఱడిల్లి ) మకరందా ! గాఢానురక్తితోడినా ప్రాణసఖిచే ప్రాలువలె నున్న యీపూలదండ యాకస్మికముగా వచ్చి నా చేతఁ బడినది. నీవు చూడ లేదా ? దీనిని గూర్చి యేమందువు ?

మక — మిత్రమా ! మాలతి జీవించి యున్న దనుటకు గుర్తుగా నీమాల్యము నీకిచ్చిన దీమహాత్మురాలు. ( అనిచూపును )

మాధ — (విషాదముతో, నంజలి ఘటించి ) అమ్మా ! నమస్కారము నాప్రాణసఖి ప్రాణముతోనున్న దా ?

సౌదా — వత్సా ! భయపడకు. ఆకుమారి సుఖముగా నున్నది.

మా. మ — అమ్మా !! బ్రతికించినావు తల్లీ ! అయితే, జరిగినవృత్తాంత మేమో సెలవిమ్ము.

సౌదా — మొన్న నెపుడో కరాలాదేవిగుడిలో, అఘోరఘంటుఁడనే కాపాలికుఁడు వధింపఁబడినాఁడట — ?

మాధ — ( తొందరగా ) అమ్మా ! తెలిసినది. శ్రమపడకు —

మక — మిత్రమా ! ఏమి టది ?

మాధ — ఏ మున్నది ? ఆకపాలకుండల పగఁ తీర్చుకొన్నది —

మక — అమ్మా ! ఈమాట నిజమేనా ?

సౌదా — ఆఁ ! నిజమే ...

మక — ఔరా! ఎంతకష్టపాటు? కుముదాకరముతో శరశ్చంద్రిక కలియుట యెంతో ముచ్చటగా నుండఁగా, అకాలజలదావళి యడ్డమువచ్చి విడఁదీయుట దుర్యోగము గాక మఱేమి!

మాధ — హా ప్రేయసీ! చంద్రకలను ధూమకేతురేఖవలె నిన్నా కపాలకుండల పట్టినపు డెంతబీభత్సముపా లయినావో! హా భగవతీ కపాలకుండలా!

గీ. దివ్యసౌందర్యరాశి యీ దేహమునకు
హాని కలిగింపఁబోకు పుణ్యంబు నీకు,
సురభికుసుమంబు నెవ రైన శిరసునందు
దాల్తురే కాని రోకళ్ళ దంపఁబోరు.

సౌదా — వత్సా! అవిచార మింక విడిచిపెట్టు.
గీ. దైవమంపినయట్టు లాదారి నేను
సరిగ సమయాని కేగుట సంభవించెఁ
గానిచో నమ్మహాఘోరకర్మురాలు
జంకు లేకుండ మాలతిఁ జంపియుండు.

మా. మ — (నమస్కరించి) మహాప్రసాదము. కృతజ్ఞులము. ఆపద్బాంధవురాల వగు మీ రెవరో తెలియఁగోరెదము.

సౌదా — తెలియునులెండి. (లేచి) నేను గురుసేవ చేసి చిరకాలము తప స్సొనరించి యార్జించిన యాకర్షిణీవిద్యను మీ శ్రేయస్సునకై వినియోగించెద నిదిగో!

( అనుచు మాధవునితో నిష్క్రమించును )

మక — అబ్బా! ఇదేమో! చూడ నలవి గాకున్నది.

గీ. కటికిచీఁకట్లు మెఱపులు కలిసినట్లు
లడలు పుట్టించి యేదియో యంతరించె.
(మరల నటు చూచి భయముతో)

గీ. ఏఁడి నామిత్రుఁ డకట? ... ...
(చక్కఁగా నాలోచించి)

గీ. ... ... ... వేఁటేమి లేదు
తలఁప యోగీశ్వరీమహాత్త్వంబు దక్క.

(తర్కించుకొని) ఇది మఱియొకయనర్థ మేమో యని నాహృదయ మొకవిధముగా ముగ్ధ మగుచున్నది మఱియొకవిధముగా యోగిని దయచే శుభము సంభవించు నని యానందించుచున్నది. కానీ! ఈ కాననము వెలుపల మిత్రవర్గముతోఁ గలసి మాకై యెదురుచూచునట్టి భగవతి యగుకామందకిచెంత కేగి యీవృత్తాంతము తెల్పెదను.

(అని యందఱు నిష్క్రమింతురు)

ఇది సౌదామనీ దర్శనమను నవమాజ్కము.

---

# మాలతీ మాధవము

## దశమాఙ్కము

( అంతట లవంగికా మదయంతులతో కామందకి ప్రవేశించును )

కామం — ( కన్నీరొలుక ) హామాలతీ! ఎందున్నావుతల్లీ? వచ్చి నాయొడిలో కూర్చుండవా?

గీ. వినఁగఁ గనఁగఁ దలంపఁగ విందు లగుచు
నామది నలర్చు నీపిన్ననాఁటిమాట
లాటలును బాటలును దలంపార నిపుడు
నామది దహించుచుండె న న్గావరావె?

కుమారీ! కనఁబడుచున్నావు గాని కరుణింప కున్నావు.

చ. కలకలనవ్వ్వు చొక్కపరి, కావున నేడ్చుచు నొక్కసారి, యిం
పులు దులకించు కొన్నిపలుమొగ్గలకాంతులు పర్వ ముద్దుగన్
దెలియనిపల్కులన్ బలుకనేర్చిన నీపసిపిన్ననాఁటికో
మలవదనారవిందమును మాలతి! నే మఱవంగ నేర్తునే?

లవం — ( కన్నీటితో ) ఓప్రియసఖీ! సుప్రసన్న చంద్రముఖీ! ఎందున్నావో! ఒంటిక త్తెవు. దైవదుర్విలాసమున నీ కేమికష్టము గల్గెనోగదా? హామహాభాగా మాధవా! నీ కుత్సాహ ముద యించి మఱుఁగయినదా? ఎట్లున్నావో!

కామం — ( దుఃఖముతో ) హాబిడ్డలారా!

గీ. కోర్కి విరాఱంగ వలవంతఁ గుంది కుంది
కలసికొన్నట్టిమిమ్ము నిష్కరుణ మగుచు

ఘోరదైవంబు విడఁదీసె నోరుగాలి
పాపినట్టులు లవలీలవంగములను

హా! ఏమిపాట్లు పడుచున్నారోగదా!!

లవం — (సోద్వేగముగా) ఛీ! పాడుహృదయమా! నీ వింకా కదలు చున్నావా?

(గుండె బాదుకొని పడిపోవును)

మద — లవంగికా! లే. లే. ఒక్కనిమిష మూఱడిల్లి యుండుము.

లవం — (దుఃఖించుచు) వజ్రలేపమున బిగిసినట్లు నాప్రాణము నన్ను వదలకున్నది. ఏమి గతి?

కామం — మాలతీ! నీ కాజన్మమిత్రురాలు లవంగిక నీకై ప్రాణము విడువ నున్నది. కరుణించి కనవచ్చి యాదరింపవా!

గీ. స్నిగ్ధ మైనను దీపపుశిఖకు వత్తి
దొలఁగి నలుపారుముఖముతోఁ దోఁచునట్లు,
సంతతస్నిగ్ధ మైననీసఖి లవంగి
యీవు గనరామి శోభావిహీన మయ్యె.

(సకరుణముగా) కల్యాణీ! నాయొడిలో పెరిగినావు నన్ను మఱచినావు. ఇంత దయమాలినదానవైతివా మాలతీ?

ఉ. పెంచితిఁ పెద్దఁజేసితి వివేకము గల్గెడివిద్య లెల్ల నే
ర్పించితి సర్వసద్గుణగరిష్ఠుఁ డభీష్టుఁడు నైనభర్త క
ర్పించితి నోకుమారి! ననుఁ బెంపుడుతల్లిని జూడ కిట్లుపే
క్షించుట ధర్మమా? తగవు చెప్పెడిదానవు తప్పు చేయుదే?

అకటా! శారదేందుముఖీ! ఇఁక నేను నిరాశురాలనే. నాబిడ్డా మాలతీ!

గీ. కారణము లేనినవ్వు బుగ్గల నటింప
నంగరక్షార్థతిలకాదు లందగింప
నీయొడి నలంకరించెమనీకుమారు
ముద్దుగొనుభాగ్య మీాజన్మమునకులేదు.

లవం — భగవతీ! అనుగ్రహింపుము. ఇంక నేను బ్రతుకలేను. నే నీ కొండమీాఁదినుండి పడి ప్రాణాలు విడిచెదను. జన్మాంతరమం దయినా, నాప్రియసఖీదర్శనభాగ్యము నాకు లభించునట్లు దీవించుము.

కామం — వెఱ్ఱిపిల్లా! నేను మాత్రము జీవించి యుండఁగలనా? మాలతీ దుఃఖము మన కిద్దఱికిని సమానమే.

గీ. మేను విడనాడి మరల జన్మింతు మనుము
కాని, మాలతిఁ గాంతుమొ కాంచలేమొ?
అయిన నొక్కటి నిజము దేహంబు విడిచి
నంత విడనాడు మనల దుఃఖానలంబు.

లవం — తల్లీ! అదే చాలును (అని లేచును)

కామం — (జాలిగా చూచి) వత్సా మదయంతికా!

మద — ఏమి సెలవు? నన్ను ముందు నడువు మందురా? నేను సిద్ధమే (అని లేచును)

లవం — సఖీ! క్షమించు, నీ వీపని చేయరాదు, ఉండు. నన్ను మాత్రము మఱచిపోకు.

మద — (కోపగించినట్లు) పోవే! నన్ను వద్దనుటకు నీవెవతెవు? నేను నీచెప్పుచేఁతలలో నున్నానా?

కామం — అయ్యో! పాపము! ఈకుమారికూడా ప్రపాతమునకు సిద్ధపడుచున్నది.

మద — (తనలో) నాథా మకరందా! నమస్కారము.

లవం — భగవతీ! ఇది, మధుమతీనది చుట్టుకొన్న కొండనెత్తము.

కామం - పోనీ! మనపని కడ్డముగా దీనిగొడవ యెందుకు?

(అందఱు కూలుటకు సిద్ధపడుదురు)

(తెరలో) ఆశ్చర్య మాశ్చర్యము.

గీ. కటికిచీఁకట్లు మెఱపులు కలసినట్టు
లడలు పుట్టించి యెదియో యంతరించె.

కామం — (అటు చూచి యద్భుతానందములతో నొక్కయడుగు వైచి)

గీ. ఎట్లు? మకరంద! యేమిది? ...

మక — (ప్రవేశించి)

గీ. ... ... ... ఏమి దేమి?
మనమహాయోగినీయోగమహితమహిమ.

(తెరలో) అబ్బా! ఏ మీజనసమ్మర్దము? — అయ్యో! పెద్ద మంత్రి కెంతకష్టము? — ఇఁక మాకు దిక్కెవ్వరు?

గీ. కన్నయొకబిడ్డ మాయమై చన్న దన్న
ఘోరవార్త విరక్తుఁడై భూరివసువు
వహ్ని కాహుతి గాఁ గోరి స్వర్ణబిందు
దేవతీర్థంబుచెంతకుఁ బోవుచుండె.

మద, లవం — (విని) అయ్యో! మాలతీమాధవులు జీవించియున్నా రనుకొనుచున్నంతలో మఱి యీఘోరవార్త యేమన్నా?

కామం — ఆహా విధివిలాసము! విషాద మొకవంక — వింత యొక వంక —

చ. సురియలు చంద్రసవముచుక్కలు నొక్కట సోకెనో! మిణుం
గుఱులు సుధాకిణంబులును గూడి పయిం బడెనో,! యసంగ నీ
యురుతరదుఃఖమూలములు నుత్సవహేతువు లై ... ట లి
త్తఱి వినవచ్చుచుండె నిది దైవవిలాసము గాక యేమగున్ ?

మక — గీ. విషము సంజీవి కలసినవిధము దోఁప,
తిమిరమును దేజమును గూడు తెఱఁగు దోఁప,
శశికరము మెఱపు చేరినచాడ్పు దోఁప,
తిరుగుచున్నది మాభాగధేయ మిప్పుడు.

( తెరలో ) నాన్నా! వద్దువద్దు. అగ్నిలో నుఱుకవద్దు నిన్నుఁ జూడ నేను తొందరపడుచున్నాను. కూఁతురిని చూడవా తండ్రీ! నా నిమిత్తము లోకకళ్యాణదాయక మైననీశరీరమును పరిత్యజించుచున్నావా? నేను సిగ్గు విడిచి దయ విడిచి మిమ్ము విడిచినాను. క్షమించు నాయనా! అగ్నిలో నుఱుకవద్దు.

కామం — హా కుమారీ! మాలతీ! పునర్జన్మమెత్తినావను కొనుచుండ నీకు మఱియొక యనర్థము సిద్ధమైనదా? బిడ్డా! దుఃఖింపకు.

మద, లవం — హా సఖీ! మాలతీ! భయపడకు —

( అంత తెలివి తప్పియున్న మాలతిని పట్టుకొని మాధవుఁడు ప్రవేశించును )

మాధ — అయ్యో కష్టము కష్టము!

గీ. కష్టములు దాఁటి గట్టెక్కి కంటఁ బడిన
కాంత వెండియు సంశయగ్రస్త యయ్యె
పక్వమై సిద్ధ మగుకర్మఫలము నెవ్వఁ
డనుభవింపక తప్పించుకొనఁ గలండు?

మక — వయస్యా! ఆయోగిని యెక్కడ?

మాధ — శ్రీపర్వతమునుండి యామెతోనే మే మెగిరి యిక్కడికి వచ్చినాము. ఆయాటపికునియార్తవాక్యము విని యామె యేమైనదో నాకు మరలఁ గనఁబడలేదు.

కామం, మక — ఓయోగీశ్వరీ? దయచేసి మమ్ము రక్షించుము. దాఁగి యున్నావా? రమ్ము.

మద, లవం — సఖీ మాలతీ! సఖీ మాలతీ!! (వణఁకుచు) భగవతీ! ఊపి రాడుట లేదు. గుండె కొట్టుకొనుట లేదు. తల్లీ! రక్షించుము. హా మహామాత్యా! హాప్రియసఖీ! మీ రొకరి నిమిత్త మొకరు ప్రాణములు విడుచుచున్నారా?

కామం — హా వత్సా మాలతీ!

మాధ — హా ప్రేయసీ!

మక — హా సాధ్వీమణీ!

(అందఱు మూర్ఛిల్లి మరలఁ దెలివి గాంతురు)

కామం — ఏమిది? పట్టి చీల్చినట్లుగా మేఘమునుండి పయోధారలు పడుచున్నవి. అహో! మాలతి యింక బ్రతుకును.

మాధ — (నిట్టూర్చి) అమ్మా! మాలతికి తెలివి వచ్చిన ట్లున్నది.

గీ. ఊపి రాడంగ ఱొమ్ము పై కుబుకుచుండె
కన్నుఁగవ తొంటిరీతిని గానవచ్చె
మూర్ఛ తొలఁగుచునుండె నంభోరుహాంబు
విరియుచున్నట్లు వదనంబు వెలయఁజొచ్చె.

(తెరలో)

పద్మావతీప్రభువు నందనునితో వచ్చి వద్దువద్దని కాళ్లు పట్టుకొని బ్రతిమాలినా వినక భూరివసు వగ్నిప్రవేశమునకుసిద్ధపడెను.

కాని, మాలతి బ్రతికియున్న దని నేను కేక వేయఁగానే గురు వాక్యము చెవినిబడినట్లు వెనుకకు తగ్గెను.

మాధ, మక — భగవతీ! నీతపస్సు ఫలించినది. ఆయోగిని తనగగన యానవేగంబునను తనప్రభావంబునను తండ్రికూఁతుళ్లను రక్షించినది. అదిగో మేఘములను చీల్చుకొని యిటువచ్చుచున్నది.

కామం — మనభాగ్యము పండినది.

మాల — అమ్మా! ఇప్పటికి ప్రాణము వచ్చినది

కామం — (సంతోషముతో) రా తల్లీ మాలతీ!

మాల — హా! భగవతీ! (వచ్చి కాళ్లపైఁ బడును)

కామం — (లేవఁ దీసి కౌగిలించి మూర్ధ మాఘ్రాణించి)

క. బ్రతుకుము పుత్త్రీ! నీపతి
బ్రతికింపుము నీమనఖుల బ్రతికింపుము నా
మతి నీవు తల్లిదండ్రుల
గతి నీవు కుమారి! సుఖము గనుమీ యింకన్.

మాధ — మకరందా ఇప్పటికి నేను మరలజీవలోకమున నడుగు పెట్టితిని

మక — (సంతోషముతో) మిత్త్రమా! నమస్యము—

మద — లవం — ప్రియసఖీ! మాలతీ! నీదర్శన మెప్పు డగునా యని యెదురుచూచుచు మాకన్నులు కాయలు కాచియున్నవి. ఒక్క మాఱు కౌఁగిలింపు మమ్మా!

మాల — హా! ఎన్నాళ్లకు కంటఁబడినారు?

(అనుచు నిద్దఱిని కౌఁగిలించును)

కామం — కుమారులారా! అన లేమి టీగొడవ?

మా, మ — వేఱే యేమున్నది? అకపాలకుండల తెచ్చి పెట్టిన కష్టము — ఆపుణ్యాత్మురాలు సౌదామని సుమ్ము గట్టెక్కించినది.

కామం — ఓహో! అఘోరఘంటుని చంపినందు కిది ప్రతిక్రియ —

మద, లవం — అహో! ఆశ్చర్యము, రెండుసార్లు దారుణదుఃఖము కలిగించినా, దైవ మనుకూలమై తుదకు సుఖము కలిగించినది. అదే చాలును తల్లీ!

సౌదా — (ప్రవేశించి) భగవతీ! నీపూర్వశిష్యురాలు నమస్కరించు చున్నది.

కామం — సౌదామనీ! క్షేమమా?

మా. మ — ఏమిటి? ఈమె భగవతి శిష్యురాలా? అందుకే మనయెడ పక్షపాతము చూపి కష్టమున కడ్డపడి మహోపకారము గావించినది —

కామం — నిర్వ్యాజకరుణామూర్తీ సౌదామనీ! రా. (అని కౌఁగిలించి) ఎంతకాల మైనదో నిన్నుఁ జూచి —

ఉ. నీమహిమంబు నీకృపయు నీయెడ భక్తిని గూర్చె నాకు, సౌ,
దామని! శిష్యవా? గురుపదంబున కర్హవుగాని, బంధుతా,
ప్రేమనిధాన మీసుగుణపేటిక మాలతిఁ బ్రోచినట్టి నీ,
నామము సంస్మరించుచుఁ బ్రణామ మొనర్తుము నీకు నెల్లెడన్.

ఆహా! యోగినీ! నీదర్శనంబున ధన్య నైతిని.

గీ. భవ్యమతి బోధిసత్త్వంబు పరమకరుణ
మహిత మతిమానుషంబు సన్మంత్రసిద్ధి,
ఎప్పుడో శిష్యురాల వైతేమి? యిపుడు
వంద్య వైనావు, నీ కిదే వందనంబు

మద, లవం — పూజ్యురాలికి నమస్కారము.

మాల — ఔ నౌను. ఈమహనీయురాలు కపాలకుండలను భయపెట్టి నన్ను విడిపించి యింటికి కొనిపోయి యూఱడించినది. నావకుళ మాల చేతఁ గొని యీయరణ్యములకు వచ్చి మి మ్మందఱను బ్రతికించినది. దీని కంతకును గారణ మీయోగీశ్వరికి భగవతిపైఁ గలగౌరవమే.

ఇతరులు — అహో మనభాగ్యము! ఈయోగిని మనకు రెండవ భగవతియే.

మా. మ — అత్యాశ్చర్య మీయోగినిమహత్త్వము.

క. సురలోకపుచింతామణి
వర మిచ్చును కోరినట్టివారికి, మఱి యీ
నరలోకపుచింతామణి
కరుణించెను కోరకుండఁగానే వరముల్.

సౌదా — (తనలో) వీరిసౌజన్యముతోడిస్తుతి వింటే నాకు సి గ్గగు చున్నది. (ప్రకా) భగవతీ! నందనుఁ డెంతో సంతోషముతో ననుమతింపఁగా, పద్మావతీపాలకుఁడు భూరివసువు నెదుటనే యీలేఖ లిఖించి చిరాయు వగుమాధవుని కందఁజేయు మని నాచేతి కిచ్చెను (అని లేఖ్య మిచ్చును)

కామం — (అందుకొని చదువును) మీయండఱికిని స్వస్తి యగుఁగాక. మహారాజిట్లాజ్ఞాపించుచున్నాఁడు.

ఉ. పిన్నవు గాని తెల్వికిని బెద్దవు సత్కులరూపశీలసం
పన్నుఁడ వల్లుఁడై తి వని మామది సంతస మ్మంటె, నింక నీ

మన్నన లందఁగోరి గుణమాన్యుఁడు నీచెలికాని కిచ్చినా
మన్నులమిన్న యైనమదయంతికఁ సంతస మొందు మాధవా!

మాధవా విన్నావా? సంతోషించినావా?

మాధ — భగవతీ, విన్నాను. నీదయవల్ల కృతార్థుఁడ నైతిని.

మాల — ఈహృదయశల్యముకూడా, ఊడదీసి నట్లైనది.

లవం — మామహానుభావుని మనోరథము లన్నియు నిప్పటికి సఫలము లైనవి.

మక — (ముందువైపు చూచి) అరుగో! అవలోకిత బుద్ధరక్షితలు, కలహంసుఁడు — మనలను చూచి సంతోషముతో గంతులు వైచుచు వచ్చుచున్నారు!

ముగ్గురు — (ప్రవేశించి నృత్యము చేయుచు కామందకిని మాధవుని సమీపించి యిట్లు పాడుదురు)

జయ జయ భగవతి కార్యనిధానే!
జయకామందకి! నీతినిధానే!
జయ మకరందానందన మాధవ!
జయమాలతి! మదయన్తిసహితే!

(అందఱు నానందముతో కరతాళధ్వనులు)

లవం — బాగున్నది. వాళ్లమనోరథము నెఱవేఱినది. మనవలెనే వాళ్లు నానందించుచున్నారు.

కామం — ఔను. ఆనందింపరా? అతివిచిత్ర మత్యద్భుత మతిరమణీయము నైన యిట్టిప్రకరణ మెవరి కానందము కలిగింపదు?

సౌదా — మనము పరస్పరము వియ్య మందుకొంద మనుకొన్న భూరి వసు దేవరాతులచిన్న నాటికోరిక యిట్లు నెఱవేఱినది. ఇదే యిందలి రామణీయకము.

మాల — (తనలో) ఏమిటీ! మాపెండ్లి మాపుట్టుకలకు పూర్వమే మాపెద్దలు నిశ్చయించినారా?

మా. మ — (సకౌతుకము) భగవతీ! కాని, జరిగినది మేలు. ఈయోగీ శ్వరి సెల విచ్చినది మేలు.

లవం — (జనాంతికము) ఓ నమ్మా! ఇందు చెప్పఁదగిన దేమి?

కామం — (జనాంతికము) ఆఁ! ఏమున్నది? మదయన్తికామకరందుల సంబంధమును, నందనునిపట్టుదలయు జరిగినది మే అనిపింప హేతువు లయినవి. అంతే. (ప్రకా) కుమారులారా! మీకా సందేహ మక్కఱలేదు. మే మందఱము చదువుకొనేరోజులలో నీసౌదామనియు నేనును దగ్గర నున్నపుడే భూరివసు దేవరాతులు తాము వియ్య మందు కొనవలె నని ప్రతిన పూనియున్నారు. ఇంకనో నందనుఁడుకారణముగా రాజుగారికి వచ్చినకోప మె ట్లుపశమించెనో మీకే తెలియును.

మాల — అబ్బా! మాతండ్రి కెంత గుట్టు?

మా, మ — ఆహా! వంచకమును విశ్వాసజనకము నగుచు గొప్పవారి నీతిచాతుర్య మెంతేని శుభప్రదమై కార్యసాధక మగును గదా!

కామం — వత్సా మాధవా!

చ. హృదయము లేక మైనమిము నిద్దఱ నేకముచేయు పూనికన్,
వదలక యుష్టకష్టములపాల్పడి కార్యము నిర్వహించినా,

మొసవెను నీదుమిత్రునికి నుత్సవ, మాన్నృపనందనుల్, మిమున్
సదయతఁ గాంచుచుండి, రిఁక నాయొనరించెడి దేమి తెల్పుమా ?

మాధ — (హర్షముతో) ఇంతకంటె నాకు కావలసిన దేమి భగవతీ ! అయినా,

ఇది భరతవాక్యము

గీ. అఖిలజగతికిఁ గల్యాణ మగును గాక
పరహితపరాయణత్వంబు ప్రబలుఁ గాక
ఎల్లదోషంబులున్ శమియించుఁగాక
ప్రజ సుఖించెడుఁగాక యీశ్వరునికరుణ.

కామం — తథాస్తు.

(అని యందఱు నిష్క్రమింతురు.)

ఇది దశమాజ్ఞము



